సాహిత్య

# ప్రస్థానం

ఆగస్టు 2015



చలసాని ప్రసాద్‌కు నివాళి

వెల రూ. 10

సాహితీస్రవంతి

# చలసాని ప్రసాద్‌కు నివాళి










విప్లవ రచయితల సంఘం వ్యవస్థాపక సభ్యుడు, ప్రముఖ సాహిత్యవేత్త చలసాని ప్రసాద్ (83) జూలై 25న విశాఖపట్నం, సీతమ్మధారలోని స్వగృహంలో ఆకస్మికంగా గుండెపోటుతో కన్నుమూశారు. కొన్ని సంవత్సరాల క్రితం చలసాని ప్రసాద్ భార్య కన్నుమూశారు. వారికి ఇద్దరు కుమార్తెలు, కృష్ణాజిల్లా భట్ల పెనుమూరు వద్ద నాదెండ్లవారి పాలెంలో 1930 డిసెంబరులో చలసాని ప్రసాద్ జన్మించారు. కమ్యూనిస్టు కుటుంబ నేపథ్యం వల్ల చిన్నప్పటి నుంచే వామపక్ష భావాలతో పెరిగారు. ఎమర్జెన్సీ సమయంలో పలుమార్లు అరెస్టయి జైలుకు వెళ్లారు. ఆ తర్వాత విశాఖపట్నంలో ఎ.వి. ఎన్ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేశారు.

శ్రీశ్రీ సమగ్ర సాహిత్యానికి సంపాదక బాధ్యతలు వహించి విలువైన సంకలనాలుగా వెలువరించారు. కొడవటిగంటి కుటుంబరావు సమగ్ర సాహిత్యానికి కూడా సంపాదకులుగా ఉన్నారు. సైద్ధాంతిక విభేదాలున్నప్పటికీ వ్యక్తిగతంగా స్నేహబంధాలు కొనసాగించేవారు. ఇటీవల సాహితీస్రవంతి విశాఖపట్నంలో నిర్వహించిన గురజాడ సాహిత్యవేదిక కార్యక్రమాలలో పాల్గొన్నారు. సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం పత్రిక తరపున చలసానికి జోహార్లర్పిస్తున్నాం.

## సాహితీస్రవంతి ఆధ్వర్యంలో విశాఖపట్నంలో ఆగస్టు 2న జరిగిన 'కవిత్వ కార్యశాల దృశ్యాలు

1. ప్రారంభ సభలో ప్రసంగిస్తున్నగంటేడ గౌరునాయుడు, చిత్రంలో ఎల్.ఆర్. స్వామి. ప్రొ॥ చందు సుబ్బారావు, చీకటి దివాకర్, వొరప్రసాద్, డా॥ సీతారాం. 2. ఉత్తరాంధ్ర కవుల కవితా సంకలనం 'చైతన్య స్వరాలు' ఆవిష్కరణ. చిత్రంలో డా॥ సీతారాం, డా॥ మేడిపల్లి రవికుమార్, రామతీర్థ, అజయ్‌శర్మ, ఎ.వి. రమణారావు. 3. కవిత్వ శిక్షణా శిబిరాన్ని వినూత్నంగా నిర్వహిస్తున్న డా॥ సీతారాం. కవిత్వ నిర్మాణంపై ప్రసంగిస్తున్నడా॥ మేడిపల్లి రవికుమార్. చిత్రంలో సత్యాజీ, పి.ఎస్. శ్రీనివాస్ 4. రాష్ట్రంలోని వివిధ జిల్లాల నుండి విచ్చేసిన కవులు, సాహిత్యాభిమానులు


1


2




3


4



సాహిత్య ప్రస్థానం ఆగస్టు 2015

సంపుటి : 14 సంచిక : 8



# సాంస్కృతిక పునర్వికాస శక్తులు ఒక వేదిక మీదికి రావాలి

◆ తెలకపల్లి రవి

ఇది ఒక గొప్ప సందర్భం. ఇది ఒక సంకేతం కూడా. ఇది ఒక గొప్ప సంఘర్షణకు నాందీ భూతం. నవ్యాంధ్రప్రదేశ్‌లో అనేకానేక మాయాబజార్లున్న విజయవాడను వేదికగా చేసుకున్నాము. నిజంగా నవ్యాంధ్రప్రదేశ్ గర్వించదగిన నాందీ ప్రస్తావన ఏదైన ఉన్నదంటే అది ఈ రోజున సివిగారికి చేసేటువంటి సత్కారమనడంలో సందేహం లేదు. అందలాలెక్కినవారిని సన్మానించడానికి చాలా మంది ఉంటారు. కాని ఒక జాతి ఒక చైతన్యవంతమైన ఒక సామాజిక బృందం ఒక రచయితని, కవిని 40 సంవత్సరముల తర్వాత గుండెల మీద పెట్టుకుని మీరు వేసిన అంకురాలతోనే చైతన్యవంతంగా ముందుకు పోతున్నామని చెబుతున్నామంటే బహుశా సివిగారికి జీవితంలో ఇంతకంటే సంతోషం ఏముందదని నేననుకుంటున్నాను. తాను రాసింది జాతి మంత్రంగా మార్మోగాలని శ్రీశ్రీ అన్నాడు. 40 ఏళ్ల తర్వాత కూడా తన రచనలు ఇంకా జాతి ఆమోదం పొందుతాయోమోనని వేచిచూస్తున్నానన్నాడు చలం. కాని ఇక్కడ చేరిన చాలా మంది సి.వి.గారు ఆనాడు వేసినటువంటి అంకురాలే.. ఇది ఒక సాహిత్య, రాజకీయ సమ్మేళనం. ఇందులో గొప్ప సంకేతం ఉంది. సివి ఆనాడు ఆకాంక్షించిన సాంస్కృతిక పునరుజ్జీవనం శక్తులు, సాంస్కృతిక పోరాట శక్తులు ఉండటమే కాదు ఒక వేదిక మీదకు సాంస్కృతిక వికాసం కోసం ఉద్యమించే సందర్భం ఉన్నదని ఈ సమావేశం చెబుతుంది. అప్పుడెప్పుడో అభ్యుదయ రచయితల సంఘం ఆధ్వర్యంలో చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారికి గొప్ప సన్మానం జరిగింది. తర్వాత శ్రీశ్రీ గారి షష్టిపూర్తి విశాఖలో ఘనంగా జరిగింది.. చిలకమర్తి, శ్రీశ్రీ గారి తర్వాత ఇంత గొప్పగా ఒక అభ్యుదయ కవికి సన్మానం జరిగిందంటే అది సివిగారిదే . ఇది గొప్ప కోసం కాదు. ఒక చారిత్రిక వాస్తవాన్ని తెలియజేయాలనే చెబుతున్నాను. సభలో చాలా మంది కవులు రచయితలున్నారు. హోరాహోరీగా మాట్లాడ గలిగినవారు, పోట్లాడ గలిగినవారు కూడా ఉన్నారు. కాకపోతే కాలం మీద కత్తులు వేలాడుతున్నాయి. అందువలన ఎవరం కూడా చాలా ఎక్కువ సమయం తీసుకునే అవకాశం లేదు.

సివిగారి సంక్షిప్త సందేశంలోనే ఈనాడు గొప్పగా చెప్పారు. ప్రధానమంత్రిగారి ఆధ్వర్యంలో జరిగినటువంటి యోగాసనార్భాటాలకు విరుగుడు ఏదైనా ఉందంటే విజయవాడ వేదికగా జరుగుచున్న ఈ సభే. ఆసనాలు అనేవి వైజ్ఞానికంగా చూస్తే మనం వ్యతిరేకం కాదు. కాని ఆ పేరుతో బాబాలను తీసుకొచ్చి ఉన్నవీ లేనివీ చెబితేనే సమస్య వస్తుంది. వంద

సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్దన
కె.లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా

సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 040 - 27660013, 9490099059,
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

మాగద కైవారం వంటి అందమైన అబద్ధం చెబుతున్నావా అని వశిష్టుణ్ని ప్రశ్నిస్తాడు వేనుడు నరబలిలో. అలాగే ఈ ప్రశ్న ఈ రోజు కనుక మనం వేయకపోతే ఈ అందమైన అబద్ధాలు అంత గొప్ప ఇంతగొప్ప అంటూ సాగుతుంటాయి. సత్యకామ జాబాలికి తండ్రి ఎవరు, రుషి వశిష్టుడికి తండ్రి ఎవరు, బానిసజాతికి తండ్రి ఎవరు అని ప్రశ్నిస్తాడు సివి. ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్ని కావాలిప్పుడు. దాచేస్తే దాగని సత్యం అన్న శ్రీశ్రీ మాటలు సివి ప్రతి రచనలో కనిపిస్తూనే ఉంటాయి. శుభంగా తిరిగి రావయ్యా సుందరయ్య అని సుందరయ్య గురించి వ్రాసినా - మళ్ళీ రష్యా దేశం వెలుతున్న మహాకవి శ్రీశ్రీకి అని రాసినా పుస్తెను సైతం కమ్యూనిస్టు పార్టీకి సమర్పించిన సతిని వదలిపెట్టి ఎలా వెళ్లావయ్యా అని డివిఎస్‌పై కవితలో ఆవేదన ప్రకటించినా ఒక మక్కలి ఘోషాల్ గురించి- ఒక చార్వాకుడి గురించి స్మరించినా అన్నింట్లో ఉన్నది ఒకటే- ఉన్నటువంటి యథాతథ స్థితిని, దోపిడీను, పీడనను, సామాజిక అణచివేతను ప్రశ్నించడం, తాను ప్రశ్నించడమే కాదు ప్రశ్నించే వారికండగా నిలబడడమనే గొప్ప విషయం సివిలో మనకు కనపడుతుంది. అందుకే సివిగారు ప్రధానంగా కవి అయినా సృజనాత్మక రచనలే గాక అనేక సైద్ధాంతిక రచనలు చేయడం సాధ్యమైంది. రాష్ట్రంలో చాలా పేరు పొందిన కవులు కూడా కొంతమంది ఒక పీఠిక రాయడానికి ఏడాది, రెండునెలలు తీసుకుంటారు. ఇలా అంటున్నందుకు ఆ కవులు మన్నించాలి. కవిత్వాన్ని సైద్ధాంతిక రచనలను నిర్దిష్టంగా పరిస్థితులకు అన్వయించి అందించడంలో సివి సవ్యసాచి.

హేతువాదం అనేది నిజంగా హేతివాదం. హేతి అంటే కత్తి. రాస్తున్నానొక గీతి, చేస్తున్నానొక హేతి రావోయి రావోయి లోనికి సందేహం దేనికి అని ఖడ్గసృష్టి చేశాడు శ్రీశ్రీ. ఖడ్గసృష్టిపై దాడి చేస్తే ఖడ్గసృష్టి కావ్య పరామర్శ అని సివిగారు రాశారు. పరామర్శ అని ఎందుకు పెట్టారు సార్ అని నేను అడిగాను. తెలుగులో విమర్శ అంటే చీల్చి చెండాటమే, అందుకే పరామర్శ అని పెట్టాను అన్నారు. ఈ రోజు భారతదేశంలో సామాజిక తిరోగమన వాదం, సామాజిక పునరుద్ధరణ వాదం పైకి లేస్తున్నప్పుడు- జాషువా అన్నట్టు నాలుగు పడగల హైందవ నాగరాజు బుసకొడుతున్నప్పుడు మళ్లీ ఒక హేతువాద చైతన్యం రగిలించటానికి ఒక సామాజిక ఉద్యమంలా విశాల వేదిక మీదకు రావాలి అని చెప్పటానికి ఈ సమావేశం దోహదం చేస్తుంది. సివి తొలి రోజుల్లో నా కవితలు చూసేవారు. పదునైన కలం అప్పుడే ప్రోత్సహించారు. నరబలి కావ్యంలో క్రైస్తవం, హిందుమతం గురించి రాశారు. ఇస్లాం గురించి వివరణ లేదు అని నేను చెప్పాను. దాని గురించి నాకు అంత అవగాహన లేదు అని మొదట చెప్పారు. తర్వాత అదంతా సేకరించి రాసి ఒక రోజు ఉదయాన్నే పట్టుకొచ్చారు. సివి ప్రూఫ్‌లు చాలా జాగ్రత్తగా చూసుకుంటారు. తన పుస్తకాలు తానే వేసుకున్నారు. మళ్లీ ఇన్నేళ్లకు ఈ రోజున సివి గారి మొత్తం పుస్తకాలు విడుదల కావడం చర్చించడం గొప్ప విషయం. వామపక్ష సమావేశాలన్నింటిలో కూడా విశాల సాంస్కృతిక కృషి ఏదైతే చెబుతున్నారో దానికి ఈ సభ ఆచరణరూపంగా ఉంది. వారు 70వ దశకంలోనే ఆంధ్రలో చేశారు. అప్పుడు టివిలు లేవు. అప్పుడు సౌండ్‌లు చెవిలో ఊదరగొట్టటాలు లేవు. ఆల్‌ఇండియా రేడియో ఒక్కటే. ఇప్పుడు 60-70% ప్రొద్దున్నే ఫోన్లు, టీవిలు ఇవన్నీ ఛాందసాల మోత మోగిస్తున్నాయి. కాబట్టి 70వ దశకంలో వారు చెప్పిన భావాలను మరింత ఉధృతంగా విస్తృతంగా ప్రచారం చేయవలసి వుంది.

అభ్యుదయ సాహిత్యం, దిగంబర కవిత్వం మధ్యలో ఒక శూన్యతం వచ్చిందని చెబుతుంటారు. అభ్యుదయ కవిత్వానికి కాలం చెల్లిందని చాలా మంది భావించారు. ఆ సమయంలో కారుచీకటిలో కాంతిరేఖలా వచ్చింది సివి కవిత్వం. తర్వాత ఇతర రచనలు. నలభైఏళ్ళ తరువాత ప్రజాశక్తివారు అన్నింటిని ముందుకు తీసుకురావడం అందరూ హర్షించడం చూస్తున్నాం.

మీరు ఈ రోజు వేసిన ఈ ఆహ్వానం చూసుకుంటే ఎంత మంది వ్యక్తులు, శక్తులు, ఎంత మంది సంస్థలు ఇంకా ఎంతమంది ఇందులో భాగం పంచుకున్నారో అర్థమవుతుంది. వీళ్ళందరూ భవిష్యత్తులోనూ కూడా తప్పకుండా కలసి ముందుకు పోవాలని కోరుకుంటున్నాను. డైరెక్టర్ ఉమామహేశ్వరరావుగారు సినిమా డైరెక్టర్‌గా కాదు సభ డైరెక్టర్‌గా చెప్పినట్టు ఈ రోజు సాంస్కృతిక ప్రపంచీకరణ ప్రజల్ని ముంచెత్తుతున్న పరిస్థితులలో ... రకరకాలుగా ఆర్థిక ఉద్యమాలు, చైతన్యాలు, రాష్ట్ర విభజన, వ్యాపార సంస్కృతి మరీ ముఖ్యంగా విజయవాడలోనే నవ్యాంధ్ర సవ్యాంధ్ర అవుతుందనే కదా మనం చూడాల్సింది. ఈ నవ్యాంధ్ర రాజధానికి సంబంధించిన వ్యవహారాలు చాలా జరుగుతున్నవి. ఈ నేపథ్యంలో అవుతున్న సాంస్కృతిక రంగంలో జరగాల్సినది ఏమిటో చర్చిద్దాం.

**(విజయవాడలో 28.06.2015 న నిర్వహించిన సివి సమగ్ర రచనలు - సమాలోచన సదస్సు అధ్యక్షోపన్యాసం)**

# సివి ఒక సైంటిఫిక్ సోషలిస్ట్



◆ ఉమా మహేశ్వరరావు

కన్వీనర్, సివి సమగ్ర రచనలు - సమాలోచన

సెమినార్ నిర్వహణ కమిటీ

ఈ సభను ప్రారంభించే ముందు అవగాహన కోసం కొన్ని విషయాలు చెప్పవలసిన అవసరం ఉంది. ఈ 28 సంస్థలు ఏవిధంగా ఎందుకు ఈ విషయంలో పాలుపంచుకోవలసి వచ్చింది అని చెప్పటం ఒక ఉద్దేశం.సివి రచనలు వాటి మీద సమాలోచన అనేది ఆయన రచనల్లో కనిపించే అంశాలను బట్టి నాలుగు భాగాలుగా విభజించటం అనేది జరిగింది. ఆ నాలుగు భాగాల్లోను వక్తలున్నారు. తరువాత పుస్తకాలకి ముందుమాట రాసినవారు ప్రత్యేక ఆహ్వానితులుగా ఉన్నారు. ఇవాళ్ళ మతమౌఢ్యము పెరుగుతున్నది. వ్యక్తులుందరూ ద్వీపాల్లాగా పూర్తిగా వైయక్తిక ధోరణిలో మిగిలిపోయి ఉన్నారు. గ్రూపులు గ్రూపులుగా ఉండి అస్థవ్యస్థ అయోమయ ఆలోచనలో ఉన్నారు. ఈ సమయంలో ఒక జ్ఞానమైన ఆలోచనా విధానం కావాలి. ఏ చట్టం, ఏ న్యాయం, ఏ కులం, ఏ కళ ఇవన్నీ ఏవిధమైన ఉత్పత్తి సాధనాలు. అంతకుముందు ఎవరి చేతుల్లో ఉంచుకున్నారో వారి చేతుల్లోనే ఇవన్నీ ఉన్నాయి. ఈ విధమైన విధానాలు అధిగమించడం అవసరముంది. దీనికి సంబంధించి ఒక విధమైన న్యాయబద్ధమైన సంస్కృతిని ఇప్పుడ వస్తున్న యువతరానికి అందించాలి.

ఆ యువతరాన్ని దేదీప్యమానంగా వెలిగించాలి అని ఈ 28 సంస్థలు భావిస్తున్నాయి. ఒక సాంస్కృతిక ఉద్యమంలాగా ఇది ముందుకు తీసుకొని వెళ్ళాలి. ఖచ్చితంగా ఇది చాలా అపూర్వమైన విషయం. అంటే అసలు భావజాలం అది ఆర్థికమైన సంస్కృతి చాలా చిన్న పరిధిలో లేదు. అన్ని విధాల ఆధారపడి ఉన్నది. అన్ని ఆర్థిక విషయాలు దాని చుట్టూ ఉన్నాయి. దానికి విస్తృతమైన ఒక పరిధి ఉంది. ఆ పరిధిలోకి తీసుకువద్దాము యువతలో ఒక విధమైనటువంటి శక్తిని కలిగించాలి అనుకున్నప్పుడు. తెలుగులో ఒక అపూర్వమైన కవి ఆలోచనా పరుడు, సాంస్కృతిక విప్లవయోధుడు కనిపించారు. ఆయనే సివి. ఆయన అందరికీ తెలిసినవారే. ఆయన పుస్తకాలు ఆయన ఆలోచనలు అవి ఎప్పటికీ ఒక లయబద్ధమైన మార్గదర్శకంగా ఉంటాయి. గతాన్ని ప్రేమించటం, వర్తమానాన్ని ద్వేషించడం ఆ గతాన్ని పట్టించుకోకపోవడం జాతికే ప్రమాదకరం. ఆ ప్రమాదం నుంచి జాలిపడి బయటపడేసే వ్యవహారంలో ఈ 28 సాంస్కృతిక సంస్థలు నడుం కట్టాయి. దీన్ని పురస్కరించుకొని ఇక్కడకు వచ్చిన ఆలోచనాపరులు, సాంస్కృతిక యోధులు వారందరూ ఇక్కడ దశల వారీగ దీనిలో పాల్గొంటారు. కాని ఇక్కడ ఒక చిన్న చిక్కు ఉంది. ఇది విహంగవీక్షణ పరిస్థితే కాని సూక్ష్మ విషయంలోకి వెళ్ళే అవకాశం లేదు. ముందు ముందు జిల్లాల వారీగ ఈ సభలను నిర్వహిద్దాం. ఒక సాంస్కృతిక పునరుజ్జీవనానికి నడుం కడదాం.

ఇక్కడ కులానికి, వర్గానికి వున్న సాపత్యం గురించి సివి గారు తన రచనల్లో చెప్పారు. ఒక చోట యుగయుగాల శ్రామికవర్గ చరిత్రే దళిత చరిత్ర అని చెప్పారు. అంటే వీటిమధ్య వున్న సారూప్యం ఎలా వుందనేది చాలా బాగా చెప్పారు తన రచనల్లో సీవీగారు. ఆయన ఖచ్చితంగా ఒక సైంటిఫిక్ సోషలిస్ట్. ఆయన రచనల్ని చదివిముఖ్యంగా యువకులు అధ్యయనం చేసి ముందుకు వెళ్ళవలసిన అవసరం వుంది. సీవీ గారు మనుధర్మ శాస్త్రం,శూద్ర దళిత బానిసత్వం అనే దాంట్లో ఒక మాట చెబుతారు, మనుస్మృతి అమల్లోకొచ్చి నేటికి రెండు వేల సంవత్సరాలు దాటిపోయింది. అయినా, మన మానసిక, సాంస్కృతిక, సాహితీ, సాంఘిక రంగాలలో ఈ స్మృతి ప్రభావం విరగడగాని పీడలా, భయంకరమైన నీడలా మనల్ని నేటికీ వెన్నాడుతూనే వుంది అని చెప్పారు. ఇంత గొప్ప విషయాన్ని వర్ణవ్యవస్థ మీద, దానికి సంబంధించిన మూలాల మీద చెప్పిన సీవీ గారికి మరొకసారి జేజేలు పలుకుదాం.

❧



## సివి స్పందన

సాహితీ, సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం ప్రజాశక్తి వారు నేడు నిర్వహిస్తున్న ఈ సమావేశం ఎంతో శక్తివంతమైనది. ఈనాడు నా దేశంలో వివిధ రంగాలలో చిత్ర విచిత్రమైన మార్పులు వస్తున్నాయి. ఇండియాలో భక్తిరసం గోదావరి వరదలాగా పారుతుంది. పదేళ్ళ పిల్లల నుండి 60ఏళ్ళ ముసలివాళ్ళ వరకు అందరూ యోగా పేరిట విచిత్రమైన డ్రిల్ చేస్తున్నారు. ఈ యోగ వలన క్యాన్సర్ రోగం వస్తుందో లేక భరించలేని ఆధ్యాత్మిక ఆనందం లేక సంపద లభిస్తుందో నాకైతే తెలియదు. ఇంగితజ్ఞానం సామాన్యమైనది కాదు. చాలా విలువైనది. కామన్సెన్స్ ఈజ్ నాట్ కామన్, బట్ వెరీ కాస్ట్లి. హేతుబద్ధమైన ఆలోచన, సైంటిఫిక్ దృక్పథం నేడు చాలా అవసరం. సతీసహగమనాన్ని పూడ్చిపెట్టిన రాజారామమోహనరాయ్ విధవలకి మళ్ళీ పెళ్ళిళ్ళుచేసిన మహావీరుడు కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు కవిరాజు త్రిపురనేని రామస్వామి, జ్యోతిభాపూలే, డా॥అంబేద్కర్, కుసుమ ధర్మన్న, గుర్రం జాషువ లాంటి మహానుభావులు మహోన్నతమైన సాంస్కృతిక పునరుజ్జీవనానికి ప్రాణం పోశారు ఆ పునర్వికాసం నేడు నాశనమైంది. మతశక్తులు అత్యంత భయంకరంగా పుంజుకుంటున్నాయి. మళ్ళీ మనమంతా సాహితీ సాంస్కృతిక పునరుజ్జీవన ఉద్యమం కోసం సమస్త శక్తిని వినియోగించాలి. ఇది నా అభిప్రాయం ఇంతటితో ముగిస్తున్నాను. ❧

## ప్రచురణకు మా నాన్నగారు ఒప్పుకోవడం మాకే ఆశ్చర్యం వేసింది

మా నాన్నగారు ఇంతసేపూ ఎప్పుడూ కూర్చుండలేదు. మహా అయితే పది నిమిషాలు. లేదా ఎవరైనా పిలవడానికి వచ్చినా, ఫోన్ చేసినా, నాకు కుదరదు అని ఖరాఖండీగా చెప్పేవారు. ఏమన్నా వుంటే నా పుస్తకాల్లో అన్నీ రాసేసాను. అది మీరు చూసుకోండి అని చెప్పేవారు. అట్లాంటిది. దీనికి ముందు కూడా ఇంకొక చిన్న మాట చెబుతాను. చాలామంది పేర్లయితే చెప్పలేను. పుస్తకం వేసుకుంటామని వచ్చినా సరే రకరకాల కారణాల వల్ల మేము ఇవ్వలేదు. ఒక వ్యక్తి వేయడానికి, ఒక సంస్థ వేయడానికి చాలా తేడా వుంటుంది అని నమ్మి ప్రజాశక్తి వారు అడిగిన వెంటనే మా నాన్నగారు ఒప్పుకోవడమనేది మాకే ఆశ్చర్యమేసింది. ఆయన ఒక్కమాట కూడా ఏం మాట్లాడలేదు. అడిగిన వ్యక్తి కూడా అంత పెద్ద వ్యక్తి. ఆయనకి చిరకాల మిత్రులు. ఆయన అడిగిన దాని మీద వెంటనే ఒప్పుకున్నారు. సభ ఒక గంట సేపు జరిగితే వెంటనే బయటికి వెళ్ళిపోతారని, అలాంటిది మార్నింగ్ నుంచి ఇప్పటివరకు ఓపికతో, ఆయనేం చెప్తారనో, ఆయన బుక్స్‌లో ఏం వుందనే వుద్దేశంతోనో కూచుని, మొత్తం వినడం మాకు చాలా ఆనందం కలిగించింది. యాక్చువల్‌గా సౌండ్ పడదు ఆయనకి. అయినా మీరు గమనించే వుంటారు



చాలామంది. ఇలా చెవులపై చేయి పెట్టుకొని అలా వింటానే వున్నారు ఆయన. ఆయన వెనుక నిల్చున్న ఏకైక మూలస్థంభం మా అమ్మ. ఎందుకంటే నేను చాలా చిన్నపిల్లోణ్ణి. ఆవిడే లేకుండా, ఆవిడ సపోర్టే లేకుండా, తానన్ని పుస్తకాలు రాసుండేవాడు కాడేమో. ఇంట్లో ఏం జరుగుతుందో తెలియదు నాన్నకి. అంతా అమ్మే చూసుకునేది. అసలు డబ్బులున్నాయో లేదో తెలియదు. ఏమీ తెలీదు. ఎన్నో సంవత్సరాలు ఇంటికి రాలేని పరిస్థితి. అయినా సరే అలాగే నిలబడి, వెనుక దన్నుగా నిలబడింది అమ్మ. సత్యకామ జాబాలిలో చీకటివెలుగులతో నాతో బాటు పయనించిన నా భారతికి అంకితం అని చెప్పారు. మాకు ఇంత అవకాశం ఇచ్చినందుకు ఇంత ఓపిగ్గా ఆయన పుస్తకాల గురించి విన్నందుకు ధన్యవాదాలు.

◆ ఉదయ్ భాస్కర్

(సి.వి. కుమారుడు)




# యువకులు ఆయన రచనల కోసం ఎదురుచూస్తుండేవారు.

◆ పాటూరు రామయ్య

సివి గారూ నేనూ ఇప్పటిదాకా కలిసే ఉన్నాం. మధ్యలో నేను శాసనసభ్యుడ్ని అయినప్పుడు అప్పుడప్పుడూ కలుసుకొనేవాళ్లం. అంతకు ముందు ప్రతి రోజూ కలిసేవాళ్లం. ఆయన చేసిన ప్రతి రచనా గొప్పదే. ఆనాడు సామాజిక ఆర్థిక పరిస్థితులు చాలా నిర్లిప్తంగా ఉండేవి. వర్గ శతృవులు పెద్ద ఎత్తున కలిసి సమాజంపైన విరుచుకు పడేవాళ్లు. ఆ రోజుల్లో యువతరంలో ఆలోచనలు రేకెత్తిస్తూ ఒక సామాజిక దృక్పథం కలిగే విధంగా ఆయన రచనలు చేశారు. సివికి ఇంత ప్రశస్తి వస్తుందని మేం అప్పుడు అనుకోలేదు. ఆ రోజుల్లో యువకులు ఆయన రచనల కోసం ఎదురుచూస్తుండేవారు. చాలా మంది నాస్తికులున్నారు. హేతువాదులున్నారు. నాస్తికులు నాస్తికులుగానే హేతువాదులు హేతువాదులుగానే ఉన్నారు. కాని సివి మార్క్సిస్టు దృక్పథం జోడించి రచనలు చేశారు. ఆయనకు మార్క్సిస్టు దృక్పథం అబ్బింది. ఆ విధంగా ఆయన ఒక గొప్ప రచయిత, గొప్ప కవి అయ్యారు. ఆ రోజుల్లో సి.వి., నేను, శ్రీశ్రీ విజయవాడకు వచ్చినప్పుడు కె.వి. రమణారెడ్డి గారు, వరవరరావు, అంపశయ్య నవీన్ వీళ్లంతా వస్తుండేవారు. విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ పైన కూర్చునేవాళ్లం. నవీన్ అంపశయ్య నవల స్క్రిప్టు చదివి వినిపించేవారు. అది విని మేం సూచనలు చేసేవాళ్లం. అట్లాగ గడిచిపోయింది. ఇలా మేం చాలా చర్చల్లో పాల్గొనేవాళ్లం.

సివి రెండేళ్లు తపస్సుపడి ప్యారిస్ కమ్యూన్ రాశారు. ఈ ప్యారిస్ కమ్యూన్‌ను పై నా అభిప్రాయం ఏమిటంటే నిరుత్సాహంగా ఉండేవాళ్ళకి, కార్యకర్తలకి, నాయకులకి పారిస్ కమ్యూన్ ఒక టానిక్‌లా ఉపయోగపడింది. మీరూ చదవండి మీకే తెలుస్తుంది. ఆ విధంగా ఆయన ఒక కార్మికవర్గ విప్లవాన్ని చిత్రించారు. ఆ చిత్రీకరణలో ఉన్నటువంటి పాత్రలు ఎన్నటికీ సజీవంగా ఉంటాయి. అంత వాస్తవికంగా ఆ పోరాటాన్ని ఆ నాయకుల్ని చిత్రీకరించారు. పారిస్ కమ్యూన్‌ని రక్షించుకోడానికి ఎంతమంది పోరాట యోధులు, వీరులు, శూరులు నేలకొరిగారు. అందులో చిన్నపిల్లలు ఉన్నారు. బాలబాలికలు ఉన్నారు. చదువుకునేవాళ్ళు ఉన్నారు. కూలి పనిచేసుకునేవాళ్ళు ఉన్నారు. తమ కార్మిక రాజ్యాన్ని కాపాడుకోవటానికి జరిగిన గొప్ప వీరోచిత సంఘటన అది. .

సివి గారికి అట్టడుగున ఉన్న దళితులు అంటే చాలా ప్రీతి. వాళ్ళ గురించి, వారి వికాసానికి సంబంధించి ఆలోచనలు చేసేవారు. దానికి డా॥అంబేద్కర్, ఆయనకు స్ఫూర్తి. డా॥ పెరియార్ స్ఫూర్తి. దాదాపు ఇన్ని సంవత్సరాలు మేం కలిసి ఉన్నా మా మధ్య ప్రత్యేకమైన అంశాలు ఇవే. సమాజం, పోరాటం, వర్గం వాటి విధులు ఇవన్నీ కూడా మేం చర్చించుకునేవాళ్ళం. ఇక్కడ ఒక విషయం చెప్పకుండా ఉండలేము. ప్రత్యేకించి అక్కయ్య చౌదరిగారు. ఆయన మాకు మిత్రుడు. అప్పుడప్పుడు కాట్రగడ్డ వెంకట నారాయణరావు

గారు మా ఇంటికొచ్చేవారు. మేం ఎదురుచూస్తూ ఉండేవాళ్ళం. ఆయన వచ్చినప్పుడు రాజకీయ చర్చ తప్ప. సామాజికమైన చర్చ మాకుండేది కాదు. మా బృందంలో కావలి కాలేజీలో నా సహవిద్యార్థి శ్రీ నీలకంఠం ఉండేవారు. కొన్ని సందర్భాల్లో విజయవాడలోని ఆయన గదిలోనే సమావేశాలు జరుపుకునేవాళ్లం. ఆనాటి మా బృందం కలయిక నాకెంతో విజ్ఞానాన్ని పంచేది. అది మహానుభూతి. కె.వి.రమణారెడ్డి గారు అడవి అనే ఒక కావ్యం రాశారు. అడవి నిజంగా అడవే. అర్థం కాదు. 'మీరు అడవి రాశారు అడవిలానే ఉంటుంది. అది మాకెవ్వరికీ అర్థం కాదు. అందువలన మిమ్మల్ని కవి అనలేము' అన్నాను. ఆయనకు కోపం వచ్చేది. నువ్వు అనవులే అనేవారు. డా॥రామచంద్రారెడ్డిగారు చనిపోయినప్పుడు ఆయనా, నేను వెళ్ళాం అంత్యక్రియలకి. అది ఒక పెద్ద జనసందోహం. కె.వి.రమణారెడ్డిగారు మర్నాడే ఒక కవిత రాశారు. నిజంగా గొప్ప కవి అనిపించారు. చక్కగా రాశారు. వాస్తవాలు రాశారు. కాని సివి అక్కడకు రాకుండా ఆయన మనస్సులో ఊహించుకుని రాశాడు. రమణారెడ్డి గారు చాలా ప్రేరణ పొంది, చాలా ఉత్సాహంగా కవిత రాస్తే సివి గారు అక్కడకు రాకుండానే ఒక పెద్ద కవిత రాశాడు. చాలా గొప్పగా రాశారు. అట్లాగే డి.వి.సుబ్బారావుగారు చనిపోయినప్పుడు రాశారు. ఈ విషయాలన్నీ ఇందులో లేవు. మీరు చదివే వాటిల్లో కూడా లేవు.

నేను కాలేజీలో ఉన్నప్పుడు సి. విజయలక్ష్మి పేరుతో 'విషాద భారతం' వెలువడింది. విద్యార్థులం తెగ చదివే వాళ్లం. ఎంత ఉత్సాహం చదువురులకి. ఎంత కమిట్‌మెంట్ వస్తుందో. మేం ఈ విధంగా ఆయనవి చదివి ఎంతో ఉద్రేకం పొందేవాళ్లం. ఎందుకు చెబుతున్నానంటే ఆ రోజుల్లో ఆయన రచనలు ఎంతోమందిని కమ్యూనిస్టులని చేసింది. కమ్యూనిస్టులుగా ఉన్నటువంటి వాళ్ళకి ఒక కమిట్‌మెంట్ ఇవ్వగలిగింది. ఇవన్నీ చూసినప్పుడు నాకు ఈయనలో మరొక లూసన్ మహాకవి కనిపించాడు. ఆ రోజుల్లో మా చర్చల్లో వేయి పడగలపై చాలా అసహ్యం వేసేది. చాలా కోపం. చాలా ద్వేషం. ఇప్పుడు విశ్వనాథ సత్యనారాయణ గారు లేరనుకోండి. గొప్పపండితుడు. ఆ పండితుడు ఈ సమాజ మార్పు కోసం ఉపయోగపడి వుంటే ఇట్లా ఉండేది కాదు. కాని అట్లా అయిపోయాడు ఆయన. అదే సందర్భంలో కిన్నెరసాని పుస్తకం తీసుకొచ్చి సివి నాకు ఇచ్చాడు. అంత పెద్ద మత మౌఢ్యం ఉన్నటువంటి మహాకవి, పండితుడు అయిన విశ్వనాథ వారు ఇంత చక్కని కావ్యం రాశారు అని చెప్పి నాచేత చదివించాడు సివి. అంతేకాదు ప్రతిదీ కూడా గుడ్డిగా ద్వేషించేవాడు కాదు మన సివి. ఎక్కడైనా మంచి ఉంటే ఆస్వాదించేవాడు చెడు ఉంటే తెగనరకడానికి ప్రయత్నం చేసేవాడు. ఆయనలో ఉండే గొప్ప విశిష్టత అది. దేనికీ భయపడలా. సమాజంకోసం రాస్తూనే ఉండేవాడు. ధైర్యంగా నిలబడేవాడు. శత్రువులు ఎంత బలీయంగా ఉన్నారో మనం గమనించాలి. ఇప్పటికీ దాడి చేసేదానికి, ఈ సభని భగ్నం చేసేదానికి రండి, రండహో అని పిలిచేవాళ్ళు ఉన్నారు. ఇప్పుడు ఫేస్‌బుక్‌లో పెడుతున్నారు. సివి దళితులకు వ్యతిరేకంగా రాశాడు కాబట్టి మీరందరూ సభను భగ్నం చేయడానికి రండి అని రాస్తున్నారు. అందువల్ల ఆ శక్తులు ఎంత బలంగా ఉన్నారో మనం ఆలోచించాలి. ఇటువంటి సందర్భంలో రాజకీయంగా, సామాజికంగా ఈ రోజు చాలా ప్రమాదకరంగా ఉన్నటువంటి పరిస్థితుల్లో మళ్ళీ సివి రచనల్ని ప్రజాశక్తి బుక్‌హౌస్ వారు తీసుకురావడం ముదావహం. చాలా మంచి కృషి. అందువలన ఒక అడుగు ముందుకు వేయడానికి ఇంకొక తరాన్ని మళ్ళీ మేల్కొల్పటానికి ఇది చాలా ఉపయోగపడుతుంది. నాకు వారికి ఉన్న ఆత్మీయత కాని, స్నేహం కాని ఇప్పటి దాకా కొనసాగుతూనే ఉంది. నా ఎదుగుదలకి నాకెంతో సాయం చేశారు. ఎంతో మంది సహాయపడకపోతే నాబోటి వాళ్లం ఎదగలేం. నా చేత చలం, చాసో, మల్లాది రామకృష్ణశాస్త్రి వంటి వారి రచనలు చదివించేవారు. వాటిల్లో వస్తువు ఏదైనా వాటిల్లో వుండే శిల్ప సంపదను వివరించేవారు. ఇటువంటి వారి రచనలు రచయితలకు ఎట్లా ఉపయోగపడతవో చెప్పి అవన్నీ తెచ్చి చదివించి వాక్యం రాయడం నేర్పారు. అందువల్ల ఆయన మేలు నేను ఎప్పటికీ మరచిపోలేను. ఆయన స్నేహాన్ని మరచిపోలేను, ఆయన ఆత్మీయతను నేను మరచిపోలేను. ఆయన ఇప్పటికీ నాకు మంచి ఆత్మీయుడే, స్నేహితుడే. అందుకు గర్వపడుతుంటాను.

**(సభ ప్రారంభంలో సివికి సత్కారం నిర్వహించి చేసిన ప్రసంగం.)**

ര

# సామాజిక మార్పుకు సమిష్టి కృషి

◆ కంచ ఐలయ్య




ఒక సాహిత్య చరిత్రకారుడి 24 పుస్తకాలు ఒకే సందర్భంలో ప్రజాశక్తి ప్రచురించింది. ఆయన పుట్టిన సంవత్సరం నాకు గుర్తులేదు. నేనిప్పుడే ఆయన మిస్సెస్‌ని అడిగాను. ఆయన 1930లో పుట్టారు. 85ఏళ్ళ సుదీర్ఘ జీవితంలో అంతే సుదీర్ఘ సాహిత్య ప్రస్థానం చేశారు. ఇది మామూలు విషయం కాదు. ఇక్కడ విజయవాడలో ఈ సందర్భంలో సివిగారి పాల్గొనడం చాలా సంతోషంగా ఉంది. సివిగారు ఈ వృద్ధాప్య దశలో కూడా ఒక తీవ్ర ఆవేదనతో ఈ దేశం ఎటుపోతుంది. ఈ యోగాలు, యాగాలు, భూమి, గోపురాలు వంటి వాటితో నాశనమైపోతుందని ఈ వేదికమీద ఆవేదనపడ్డ దశలో మనం ఉన్నాం. సివిగారికి నా విజ్ఞప్తి ఏమిటంటే సివిగారూ మీకంటే నేను ఐదు, పది సంవత్సరాలు చిన్నోడిని. మీకు గ్యారంటీ ఇస్తున్నాం. ఈ దేశంలో మతోన్మాద శక్తులు ఏమీ చేయలేవు.

అది ఎప్పుడు సాధ్యమైతుందంటే, దానికి ఆశ ఎక్కడుంది అంటే సివిగారు రచనల్లో ఉంది. చాలా కాలంగా సాంస్కృతిక రంగంలో, రాజకీయ రంగంలో సాధ్యపడనివి చాలా పోరాటాలు కమ్యూనిస్టు పక్షాలు చేసాయి. ఈ కమ్యూనిస్టు పక్షాలన్నీ సాంస్కృతిక రంగంలో ఏం చేశాయి అనే ప్రశ్న ఏ మూలకువెళ్ళినా ఈ ప్రశ్న ఈ ప్రశ్నగానే తలెత్తుతా ఉంది. విషయాలను చాలా బాధ్యతాయుతంగా చూడాల్సిన దశ ఇది. దేశ స్థాయిలో వర్గ కులవ్యవస్థలను, వాటి నిర్మూలనకు కావల్సిన సాంస్కృతిక, తాత్విక పునాదులతో కూడిన రచనలు కమ్యూనిస్టుల నుండి వచ్చాయా అనే చర్చ చాలా జరుగుతా ఉంది. అయితే వర్గ కుల వ్యవస్థని మార్చటానికి ఆ పక్షాల నుండి కొన్ని రచనలు వచ్చాయి. కాని భారతదేశంలో కుల వ్యవస్థను నిర్మూలించడానికి జ్యోతిబా పూలే, ఆ తర్వాత 1942లో అంబేద్కర్ రాసిన కుల నిర్మూలన వచ్చిన తరువాత ఈ పక్షం ఆ మొత్తం అంశాన్ని చూసిందా అనే ప్రశ్న వస్తుంది. కమ్యూనిస్టు పార్టీ పక్షాలన్నీ కలిసి ఈ ప్రశ్నకు సమగ్రంగా సమాధానం వెతుక్కోవడంలో ఈ దేశానికి మార్గదర&శకం దొరుకుతుంది. పూలే, అంబేద్కర్, పెరియార్ రచనలపై ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో చర్చ జరిగేనాటికంటే ముందే సివి ఈ అంశాలన్నీ తన రచనల్లో లేవనెత్తారు. వాస్తవ నైతిక ఆలోచనలతో ఈ ప్రశ్న వచ్చినప్పుడు కమ్యూనిస్టుల పక్షాన ఆంధ్రప్రదేశ్‌లో సివిగారు కుల సమస్యను చాలా తీవ్రంగా ముందు దశలోనే చెప్పారు. సివి గారు రాసిన వర&ణవ్యవస&థ మౌలికంగా కొంత కుల యాంగిల్‌ని రైజ్ చేసేందుకు ప్రయత్నంచేసింది.

బహుశా 1981, 1982లో అనుకుంటాను. మొదటిసారి విజయవాడ వచ్చినపుడు ప్రజాశక్తి, విశాలాంధ్ర షాపుల్లో ఈ వర్ణ వ్యవస్థ పుస్తకాన్ని ఆనాడే నేను చూశాను. అంటే సివిగారు తెలుగులో మౌలికమైన అంశాలు, గ్రామీణ

వ్యవస్థలో వచ్చిన పరిణామాల్ని చాలా అంశాల్ని తెలుగులో పరిచయం చేసిన విషయం మామూలు విషయం కాదు. ఇది చాలా క్రిటికల్ . సివిగారు రాజీపడడు .ఇది చిన్న విషయంకాదు. బ్రాహ్మణులు చేసేదాన్ని విమర్శించాడు. దానిలో సీరియస్ వెరిఫికేషన్ చేయలేదు. కమ్యూనిస్టు పక్షాన్నుండి వచ్చిన రచయిత భారతదేశ చరిత్రని వివిధ కోణాల్నుండి అధ్యయనం చేసి తెలుగులో ఇలా అపూర్వమైన సమస్యని మనముందు పెట్టాడు. ఆయన 24 పుస్తకాల్ని చూస్తే బ్రాహ్మణిజం మీద వ్రాసినవి. డార్విన్ఇజం మీద వ్రాసినవి సైంటిఫిక్ దృక్పథం మీద వ్రాసినవి. హేతువాదం మీద వ్రాసినవి. ఇవన్నీ ఉన్నాయి. అయితే థీరిటికల్‌గా వర్గ కులానికి ఉన్న సంబంధాన్ని చారిత్రకంగా ఎస్టాబ్లిష్ చేయడానికి కావాల్సినఎనాల్సిస్ సివి రచనల్లో ఉన్నాయి. అయితే వీటిని ఇంకా సీరియస్‌గా ఎనలైజ్ చేయాలి. ఇక్కడ ఒక్క ప్రధాన సమస్య ఏముంది అంటే ఇది నేషనల్ లెఫ్ట్‌వింగ్ చర్చల్లో క్రిటికల్ అన్ క్రిటికల్ జోన్‌లోకెళ్ళనటువంటి అంశం. మహాత్మపూలే-కార్ల్‌మార్క్స కంటే ఏమీ పూలే అనే వ్యక్తి పెద్ద చదువులేని వ్యక్తి. ఆయనకు ఆనాడు చదువుకునే హక్కు కూడా లేదు. కార్ల్‌మార్క్స పి.హెచ్.డి చేశాడు. కార్ల్‌మార్క్స్‌వెహా జర్మనీలో బెర్లిన్‌యూనివర్సిటీలో పి. హెచ్.డి చేశాడు. అంతకంటేముందు హెగల్ చేశాడు.కాని భారతదేశంలో ఆయన కాంటెంపరరీ పిరియడ్‌లో కార్ల్‌మార్క్స్ పుట్టే అవకాశం లేదు. ఎందుకులేదు జర్మనీలో కాని యూరప్‌లోకాని ఇంకెక్కడా కాని ప్రీస్ట్ నుండిక్లాస్‌ని వ్యవస్థని మార్చేటువంటి పరిస్థితి రాలేదు. శ్రామికు శక్తి నుంచి అల్మాస్ పాదర్ ఒక లాయర్ బట్ హిజ్ పాదర్ ఒక హిల్లర్. భూమి దున్నాడు. గోల్డ్ స్మిత్, ఐరన్ స్మిత్ నేషన్ ఆఫ్ వెల్త్ వ్రాసిన ఆడంస్మిత్- స్మిత్, స్మిత్ కుటుంబం నుండి వచ్చాడు. ఆడంస్మిత్ ప్రీస్ట్ కులం నుండి వచ్చి ఉంటే వ్రాసి ఉండేవాడుకాదు. అంటే బ్రాహ్మణ ప్రీస్టు కులాల్నుండి వచ్చినవాడు. ఈ దేశంలో వ్యవస్థను మార్చడానికి కావాల్సిన రాసే పుస్తకం వ్రాయగలిగే శక్తి ఆ మెదడుకుండదు. దట్స్‌నాట్ పాజిబుల్. దట్స్ ఏ క్రిటికల్, సోషలాజికల్ ఫండమెంటికల్ ఎకనామికల్ ఇష్యూ. అప్పుడు 7వ తరగతి మాత్రమే చదివాడు. తరువాత అంటే ఆయన ఒకటే ఒకటి పెద్ద పుస్తకం రాశాడు. మిగతావి చిన్న పుస్తకాలు రాశాడు. అది గులాంగిరి. స్లేవ్. యూనివర్సల్ బానిసత్వాన్ని ఆ పుస్తకంలోకి తీసుకొచ్చి బానిసత్వం అబాలిస్ కావడానికి కావలసిన మూలసూత్రాన్ని పుస్తకాల కొటేషన్ నుంచి చేయలేదు ఆయన. ప్రజల జీవితాల నుంచి చేశారు. సివిగారు పోస్టు భావహిందూ ఇండియా అనే పుస్తకం వచ్చిన తరువాత హిందూయిజం బతకదు. దట్స్ ఫినిష్ ఈ యోగాలు యాగాలు 56ఇంచుల చెస్ట్ ప్రధానమంత్రి చెస్ట్ బ్రెయిన్ బతకదు. 56 ఇంచెల చెస్ట్ అయామ్ గాట్. తరువాత వెజిటేరియన్ యిజం బతకదు. ఇండియా ఈజ్ గోయింగ్ టు బీఫ్ఏరియన్ కంట్రి. ప్రజలందరూ బీఫ్ తింటేనే బ్రెయిన్ పెరుగుతుంది అని ఎంగెల్స్ చెప్పాడు. బ్రెయిన్ స్టేబుల్, బ్రీఫ్ స్టేబుల్ ఫుడ్ అయినాక మానవ బ్రెయిన్



ఒకటి నుంచి రెండు ఉత్పత్తి చేయడం. ఆనాడు గింజకు అంతకంటే ఎక్కువ శక్తి లేదు. ఆ బౌద్ధం ఇక్కడ విప్లవానికి పునాదులు అని అర్థం చేసుకోకపోవడం వల్ల ఆ బౌద్ధం చైనాలో విప్లవానికి పునాది అయింది. సివి రచనలలో ఆ పునాదులు వున్నాయి. వాటిని ఇప్పుడు లోతుగా అధ్యయనం చేయాలి. ఇక్కడ అన్నీ విప్లవ పక్షాలూ, మిత్రపక్షాలూ వున్నాయి గనుక నేనొక్కటి చెప్పదలచుకున్నాను. ఆర్ఎస్ఎస్, విశ్వహిందూ పరిషత్, బిజెపి, వీటితో ఒక రాజీలేని పోరాటం చేసి, వాళ్ళను తొందరగా ఈ దేశం నుండి వెళ్ళగొట్టాలంటే మీరందరూ ఒక్కటి కావాలి. ఈ సీవీ వేదిక నుంచి నేను ఒక దళిత కుటుంబ పక్షం, కుర్మ కుటుంబం, గొల్ల కుటుంబం లో పుట్టా. ఈనాడు 85 ఏండ్ల జీవితంలో ఈ రెండు తెలుగు రాష్ట్రాలు - విడిపోయింది నేను లెక్కజెయ్య - ఒక సోషలిస్టు వ్యవస్థను స్థాపించడానికి అందరం ఒక్కటై బయలుదేరుదాం. చంద్రశేఖర్‌రావు, చంద్రబాబు నాయుడు ఎన్నిరోజులుంటరో చూద్దాం. అప్పుడు సీవీ రచనలు మళ్ళీ అనలైజ్ చేసినపుడు ఒక మౌలిక డెసిషన్ తీసుకోవాలి. మొదట బుద్ధుడు విప్లవం

తెచ్చిండు. శ్రీరంగంలో విప్లవం తెచ్చాడు. సార్‌నాథ్‌లో మొదటి ప్రకటన చేసినపుడు ఆల్ హ్యూమన్ బీయింగ్స్ ఆర్ కేపబుల్ నిర్వాణ అన్నాడు. హ్యూమన్ బీయింగ్స్‌లో స్త్రీలున్నారా లేదా అని అడిగాడు" మహాప్రజాపతి వేసిన ప్రశ్న సీవీ రచనలలో ప్రతీచోటా కనపడుతుంది. మనుషులంతా ఒక్కటే. కనుక సీవీ గారిలాంటి 85 ఏండ్ల సుదీర్ఘ రచనలు చేసిన వ్యక్తి రచనలు మనం గౌరవిస్తున్నాం.

ఈ దేశంలో వర్గ కుల వ్యవస్థలు రెండూ వున్నాయి. మూడవది స్త్రీ అనమానత్వం. ఈ మూడింటిని అంతమొందించాలంటే ఒక డెమొక్రాటిక్ సోషలిస్ట్ నిర్మాణం ఈ దేశంలో ప్రయోగం జరగాలి. నా దృష్టిలో కేరళ ఈ ప్రయోగం సగం తెలుగు రాష్ట్రాలు అంతకంటే బలమైన ప్రయోగం చేయగల పోరాటగడ్డలు. కానీ విఫలమయ్యాయి. రెండు మహావిప్లవాలు వచ్చినై. విఫలమైనాయి. సీవీలాంటి వాళ్ళు ఒక మహత్తర సంఘర్షణలోంచి వచ్చారు. నాకు తెలుసు రైటింగ్ ఎంత పెయిన్‌ఫుల్. బైట రెస్పెక్ట్ చేసేటోళ్ళు లేనప్పుడు నువ్వొక్కడివే రానుకుని, ఇంకెవరన్నా సదువుతరో, సదవరో అని తెల్వనప్పుడు మరీ మా కులంలాంటి కులంలో మీకు తెలుసో లేదో మా కులంలో నా పుస్తకాలెవరూ సదవరు. నేను జెప్తావుంటా.. మీరు సదవకపోయినా ఫర్వాలేదు నాయనా! గొర్లు సదువుతున్నయ్ అని జెప్తుంట. గొర్లకు సదువొచ్చుని. అటువంటి దశలో క్రిటికల్‌గా రచనలు చేయడమనేది వెరీ టార్చరస్ కోర్స్. నీ కెనిమీస్ వుంటారు బయట. చదివేవాళ్ళుండరు, కొనే వాళ్ళుండరు, అమ్మేవాళ్ళుండరు. ఇప్పుడు పాటూరు రామయ్యగారు చెప్పినట్లు మేబి బికాస్ ద కమ్యూనిస్ట్ పార్టీ ఇన్ ఎవిరీ థింగ్. ఆయనకు ఈ కరేజ్ అండ్ కాన్ఫిడెన్స్ వచ్చి రాశారు. ఇవాళ ఆర్థిక పోరాటం కంటే సాంస్కృతిక పోరాటం కీలకమనేది మీకు మూడు ఘట్టాలలో తెలుస్తుంది. ఒకటి బుద్ధుడు చేసిన పోరాటం. ఆయన ఎకనామిక్ రెవల్యూషన్ తెచ్చాడు. శ్రామికుల, శ్రమజీవుల విప్లవం తెచ్చాడు. పశు శక్తిని మొట్టమొదటిసారి అగ్రేరియన్‌కు ఉపయోగించింది ఆయనే. అంతకు ముందు యజ్ఞయాగాలలో వాటిని కోసేవారు. నోనో ఇట్ కెన్ నాట్ బి కిల్ లైక్ దట్ అని మధ్యేమార్గ మన్నాడు. నేను కమ్యూనిస్టు మిత్రులతో అడిగేదేమిటంటే సీవీ రచనల నుంచి తీయాల్సిన పాఠం తీయండి. బుద్ధుని కాలంనాటి పాఠం బుద్ధుడు తీసిండు. ఆయన యజ్ఞయాగాదులలో వంద, వెయ్యి, లక్ష పశువులను కోసి కొనుక్కుంటే చక్రవర్తి అయ్యేవాడు. కానీ అవి కొయ్యడానికి సిద్ధపడక వచ్చి ఈ సంఘం స్థాపించాడు.

మొత్తంగా భారతదేశంలో విజయం సాధించే అయ్యే ఒక డైరెక్షన్ ఇచ్చాడు అదే మధ్యేమార్గం. మిడిల్ పాత్. నా దృష్టిలో అక్కడే చాలా పోరాటాలు విఫలం చెందాయి. ఈ మిడిల్ పాత్ లో కుల నిర్మూలన అనేది కేవలం ఊదితే పోయేది కాదు. ఉత్పత్తి కులాలకు గౌరవం తెప్పించాలి. డిగ్నిటీ ఆఫ్ లేబర్. శాస్త్రీయరంగంలో చెప్పు చేయడం ఒక శాస్త్రీయమైన పని. నేను సింపుల్‌గా ఒక ప్రశ్న అడుగుతా. బ్రహ్మ, విష్ణు, రాముడు, కృష్ణుడు అందరికీ గడ్డాలు చేసిందెవడు? మంగలాయన చేసిండా, వాళ్ళే చేసుకున్నరా? కృతాయుగం, ద్వాపరయుగం, త్రేతాయుగం అంటున్నావే... ఆనాడు వాళ్ళకు గడ్డాలు చేస్తే కమ్మరి కొలిమి లేకుండ అంత అడ్వాన్స్ మంగలి కత్తి ఎట్ల వచ్చింది? కనుక, ఇవ్వాళ ఆ దేవతలందర్నీ దింపి మంగలాళ్ళను గద్దెమీద కూర్చొండ బెట్టాలి. అదీ సూత్రం దానికి సీవీ రచనలకు కావలసిన పునాదులున్నయ్. తరువాత చాలా రచనలు యిప్పుడు వస్తున్నయ్. ఇవాళ గ్రామగ్రామాన రచయితలు పుట్టుకొస్తున్నారు. సీవీ లాంటి వారి రచనలకు, మా రచనలకు ఒక విలువ ఏర్పడ్డది. ఈ దేశంలో వ్యవస్థ మారడం చాలా ఇంపార్టెంట్. మారాలి అంటే ఇతర జండాలు,, అన్ని జెండాలు ఎత్తేసి మార్క్స్, పూలే, అంబేద్కర్ ఈ ముగ్గుర్ని బెట్టుకుని, ఈ రచనలు పెట్టుకొని పోదాము. ఈ దేశం ఎంత కాలం ఆర్ఎస్ఎస్ చేతిలో వుంటదో చూద్దాం...

సీవీ లాంటి వారి రచనలకు, మా రచనలకు ఒక విలువ ఏర్పడ్డది. ఈ దేశంలో వ్యవస్థ మారడం చాలా ఇంపార్టెంట్. మారాలి అంటే ఇతర జండాలు,, అన్ని జెండాలు ఎత్తేసి మార్క్స్, పూలే, అంబేద్కర్ ఈ ముగ్గుర్ని బెట్టుకుని, ఈ రచనలు పెట్టుకొని పోదాము. ఈ దేశం ఎంత కాలం ఆర్ఎస్ఎస్ చేతిలో వుంటదో చూద్దాం...

# ఆయన రచనల్తో
# నా అనుబంధం ఏభై ఏళ్ళనాటిది.

◆ కడియాల రామమోహన్‌రాయ్




సీవీ గారు తన రచనల ద్వారా తెలుగుజాతికి మహోపకారం చేశారు. ఆయన మనల్ని ఆలోచింప చేశారు. ఆనందింపచేశారు. విద్యావంతుల్ని చేసే బాధ్యతను కూడా తీసుకున్నారు. ఆయన రచనల్తో నా అనుబంధం ఏభై ఏళ్ళనాటిది. 1965లో విషాద భారతం అనే కావ్యం ఆ సంవత్సరమే అచ్చయిన పుస్తకాన్ని నేను కొనుక్కొన్నాను. అది సి.విజయలక్ష్మి అనే పేరుతో వున్నది. పుస్తకమంతా చదివాక నేను ఆశ్చర్యపోయాను. ఏవంటే, సాంప్రదాయ సాహిత్యాన్ని., భావ కవిత్వాన్ని, అభ్యుదయ కవిత్వాన్ని మక్కువతో చదువుతున్న నాకు అభ్యుదయ సాహిత్యోద్యమంలో చెప్పుకోదగిన స్త్రీ కవయిత్రి ఎవరూ కనిపించలేదు. ఆ పుస్తకానికి కెవి రమణారెడ్డిగారు ప్రాణాగ్ని అనే పేరుతో మంచి పీఠిక రాశారు. రమణారెడ్డి గారంటే అప్పుడూ, యిప్పుడూ ఎంతో గౌరవం. ఈయన చాలా మెచ్చుకుంటున్న ఈ పుస్తకంలో ఏముంది అని శ్రద్ధగా చదివితే నాకు చాలా నచ్చింది గాని కొన్ని ఇబ్బందులు కూడా కలిగినై. ఇంత పరుషంగా, కఠినంగా, అసభ్యంగా తనెందుకు రాయాలి? అంతకుముందున్న కవులెవరూ మహాకవి శ్రీశ్రీతో సహా ఎంతో మంది కవులు ఉపయోగించని మొరటు భాష అందులో వుంది. ఇంకా విశేషమేమిటీ అంటే ఆ కావ్యంలో ఎంతో సామాజిక విమర్శ కూడా వుంది. తరువాత కొద్దికాలానికి అది స్త్రీ రాసిన కవిత్వం కాదని, ఒక కమ్యూనిస్టు మిత్రుడు నాకు చెప్పారు. .

సివి 1965 నుండి 1990 దాకా ఆయన చాలా పుస్తకాలు రాశారు. సీవీ రచనల్లో నేను కనిపెట్టిన విశేష అంశం ఏమిటీ అంటే ఆయన శిల్పం కోసం ప్రాధాన్యం ఇవ్వడం లేదు. ఒక్కొక్క చోట రెండు పంక్తుల్లో చెప్పేది ఇరవై పంక్తుల్లో చెబుతున్నాడేమిటి ఈయన అని కూడా నాకు అనిపించింది. కాని ప్రజలకు సమాజ స్థితిని, మనం ఎలా వున్నాం, ఎలా వుండకూడదు, ఎలా వుండాలి అని చెప్పే బాధ్యతను తీసుకోవడం చేత ఆయన కవిత్వాన్ని ఇంకొంచెం కిందికి దిగి కింది వర్గాలకు అర్థమయ్యే భాషలో, కొద్దిపాటి విద్యావంతులకు కూడా అర్థమయ్యే భాషలో రాసారని నాకనిపించింది. ఆయన రాసిన పుస్తకాల్లో రకరకాలున్నాయి. డార్విన్ పరిణామ వాదం, పారిస్ కమ్యూన్, హోచిమన్ రచనలున్నాయి. డార్విన్ పరిణామ

వాదం గురించి ఏదో ఒక దశలో విద్యార్థులందరూ చదువుతారు. కాని అది మానవజాతిలో తెచ్చిన మార్పు ఏమిటీ అనేది సీవీ చాలా చక్కటి భాషలో, అరటి పండు వొలిచిపెట్టినట్లు రాసి మనల్ని విద్యావంతుల్ని చేశారు. హోచిమన్ అనగానే మన శరీరం పులకిస్తుంది. మాన్ కెన్ బి డెస్ట్రాయిడ్..బట్ నాట్ బి డిఫీటెడ్ అని అమెరికా లాంటి బలవంతమైన రాజ్యాన్ని ఎదిరించి నిలిచి ప్రపంచానికే ఆదర్శ ప్రాయుడైన మహావ్యక్తి జీవిత చరిత్రను ఆయన ఒక ఇంగ్లీషు గ్రంథం నుండి అనువదించారు. మరి భారతదేశ సంస్కృతి గురించి మన ప్రజల జీవితం గురించి ఆయన రాసిన కొన్ని పుస్తకాలు చాలా గొప్పవి. సింధు నాగరికత, కౌటిల్యుని అర్థశాస్త్రం, ప్రాచీన భారతంలో చార్వాకం, భారత జాతి పునరుజ్జీవనం మనుధర్మ శాస్త్రం ఇవన్నీ చాలా గొప్ప పుస్తకాలు. ఇప్పుడు మనకి మనుధర్మశాస్త్రం, కౌటిల్యుని అర్థశాస్త్రం సంస్కృతంలోనో, తెలుగులోనో లభిస్తున్నాయి. కానీ భారతదేశంలో కొన్ని గొప్ప కుట్రలు జరిగిపోయాయి. కొంతమంది శ్రామికుల్ని, ఉత్పత్తి శక్తుల్ని అణచివేయడానికి ఈ గ్రంథాలు ఎలా తోడ్పడ్డాయి. మనిషికి మనిషిని దూరం చేసి అణచివేసిన అర్థశాస్త్రం లేదా? మనుస్మృతి చేసిన ద్రోహమేమిటి? వాటిని అడ్డంపెట్టుకుని బ్రాహ్మణ జాతి తెలుగు ప్రజలకు చేసిన ద్రోహమేమిటి? ఇది సీవీ చాలా చక్కని భాషలో, అత్యద్భుతమైన రీతిలో మనకు అందించారు.

సింధు నాగరికత మొహంజొదారో, హరప్పా తవ్వకాలకు ముందు ఎవరికీ తెలియదు. అది బైటికొచ్చాక ఆర్య ద్రవిడుల సంఘర్షణ గురించి భారత చరిత్రను మనం తిరగరాసుకున్నాం. వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ, భారతాలు వీటన్నిటి గురించి పునరాలోచనలో పడ్డాం. వీటన్నిటికంటే ముందే ఈ ద్రావిడ నాగరికత సాధించినటువంటి విజయాన్ని, ఆ నాగరికత ఎలా పతనమైందనే విషయాలను సింధునాగరికత, మనుస్మృతి గ్రంథాలలో సీవీ మనకు తెలియచెప్పారు. ఇక ఆనాడు నేను చదవంది, యిటీవల మళ్ళీ చదివింది వర్ణవ్యవస్థ. మధ్యయుగాల్లో కుల వ్యవస్థ, ఆధునిక యుగంలో కుల వ్యవస్థ వీటిని గురించి చదివినప్పుడు చాలా చోట్ల దుఃఖం ఆపుకోలేకపోయాను. మనిషిని మనిషి ఈ కులం ఎలా వేరుపరిచింది. నాలుగు వర్ణాలని చెబుతూ వందలకొలది కులాలు ఎలా ఏర్పడ్డాయి. కులం ఎప్పుడు పుట్టింది? ఎలా పుట్టింది? కొంతమంది ఎందుకు నీచవృత్తులు అవలంబించవలసి వచ్చింది. కొంతమంది ఏ పనీ చేయకుండా, దేవుడు, పరలోకం లేక ఇంకా ఏవేవో పిచ్చిమాటలు చెబుతూ సుఖాల్ని అనుభవిస్తున్నారు. రాచరికం వల్ల జరిగిన మేలేమిటి? రాజుల్ని గద్దెమీద నిలపడానికి బ్రాహ్మణులు చేసిన దుర్మార్గమేమిటి? ఇవన్నీ కూడా ఆ వర్ణవ్యవస్థ అనే పుస్తకంలో సీవీ తెలియచెప్పారు. కుల వ్యవస్థని ఎలా నిర్మూలించగలం. అంబేద్కర్ ఎన్హిలేషన్ ఆఫ్ ది క్యాస్ట్ అన్నాడే. కానీ మనం ఎక్కడున్నాం. మాల మహానాడు, మాదిగ దండోరా... ఏ నలుగురు దళిత నాయకులూ కలిసి పనిచేయలేని దుస్థితిలో వున్నాం. అసలు పాలకపక్షాలు, ప్రతిపక్షాల నాయకుల కాళ్ళ దగ్గర కూచుని పదవుల కోసం యాచించే దశలో దళిత చైతన్యం వుంది. ఇవాళ ఏ దళిత నాయకుడు తన నియోజకవర్గంలో దళితుడుగా నిలబడి గెలిచే స్థితి కాదు. డిపాజిట్ తెచ్చుకునే స్థితి లేదు. ఈ స్థితి నుంచి మార్పు రావడానికి ఆయన ఆధునిక యుగంలో కులవ్యవస్థలో అనేక ప్రశ్నల్ని సంధించారు.

మనం జాషువాని మహాకవిగా గుర్తించాం కాని, చాలామంది కుసుమ ధర్మన్న గొప్ప తనమేమిటో తెలుసుకోలేకపోయారు. సీవీ చాలా కాలం కిందటే ఆయన గొప్పదనం గురించి రాశారు. మాకొద్దీ నల్లదొరతనం అని కుసుమ ధర్మన్న ఎందుకన్నాడు? అసలు స్వాతంత్ర్యమే కనుచూపు మేరలో కనపడనప్పుడు స్వాతంత్ర్యానంతర సమాజంలో అగ్రవర్ణాలు ఏం చేయబోతున్నాయో కుసుమ ధర్మన్న అందరికంటే ముందే గ్రహించాడు. గరిమెళ్ళ వారు మాకొద్దీ తెల్లదొరతనం అంటే కాదు కాదు మాకు ఈ నల్లదొరతనం వద్దు అన్నారు. ఈ నల్లదొరతనం ఏం చేయబోతున్నదో మనం ఈరోజు ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాం. ఈ స్థితిని విద్యావంతులైన దళితులు కూడా గుర్తించడం లేదు. ఇక సీవీగారి రచనలపైన ఎవరి ప్రభావమైనా వున్నదీ అంటే మహాకవి, మహారచయిత శ్రీశ్రీ గారి ప్రభావమే. ఆయన ఖడ్గసృష్టి పుస్తకం వెలువడినప్పుడు చాలామంది ఆశ్చర్యంగా చూశారు. మహాప్రస్థానంలో వున్నటువంటి భావాలు ఇందులో ఏదో కొంచెం కఠినంగా వున్నాయి. త్రిపురనేని వెంకటేశ్వరరావు గారు ఆక్షేపిస్తూ కొన్ని రచనలు చేస్తే కెవి రమణారెడ్డిగారు ఆ చర్చలో పాల్గొన్నారు.

సీవీ ఒక పుస్తకమే రాశారు. ఖడ్గసృష్టి విశిష్టతను మనకు వివరించాడు. శ్రీశ్రీగారిని చిట్టచివరి వరకు కూడా అభిమానిస్తూనే వచ్చారు సీవీ. ఇక కొన్ని కావ్యాల విషయానికొస్తే,, నరబలి అనే కావ్యం వచనంలో రాయకూడదా అనుకున్నారు. ఎందుకంటే ఒక ఇంగ్లీషు మహావిమర్శకుడన్నాడు ఎ లాంగ్ పోయెమ్ ఈజ్ ఎ కాంట్రడిక్షన్ టర్మ్. వీరు కవిత్వం రాసేటప్పుడు విషయం వుండదు. విషయం వున్నచోట కవిత్వం వుండదు. ఇది ప్రపంచంలోని అన్ని బృహత్ కావ్యాలకు వర్తిస్తుందనుకోండి. కాని భాగవతంలో వున్న వేణుని కథని, విశ్వనాథ వేనరాజు రాస్తే, త్రిపురనేని రామస్వామి ఖూనీ నాటకం రాస్తే దానికే కొనసాగింపుగా ఆయన నరబలి రాశారు. ఆ నరబలిలో పృధువు చివరికి జ్ఞానోదయమైనట్లు వారు రాయలేదు. సీవీయే రాశారు. నువ్వు నాచేత నా తండ్రిని హత్య చేయించావు అనే ఆ మాట త్రిపురనేని ఖూనీ నాటకంలో లేదు. అది ఖూనీ చేయించాడు అని రాస్తున్నాడు త్రిపురనేని. కానీ జ్ఞానోదయమైంది పృధువుకి అని నరబలిలో సీవీ చెప్పారు. మరొక సంగతి సత్యకామ జాబాలి. జాబాలి చదువుతున్నప్పుడు నాకు కొన్నిచోట్ల నవ్వు ఆగలేదు. వశిష్ఠుడు, యాజ్ఞవంతుడు, శ్రీరాముడు వాళ్ళతో జాబాలి కాదు మాట్లాడుతోంది సీవీ అని తెలిసింది. ఎందుకంటే రామాయణ కాలం ఎంత పాతదైనా మనం క్రీస్తు పూర్వం ఏ వెయ్యేళ్ళో అనుకుంటున్నాం కదా! ఇప్పుడు అటువంటి వాదాలెవరైనా చేస్తే ఆధునిక యువకుడు ఏం మాట్లాడతాడో అదే వుంది. ముఖ్యంగా త్రిపురనేని ఆరోజుల్లోనే ఒకటి రాశాడు. మేకను బలియిస్తే దానికి స్వర్గం వస్తుందంటున్నారు కదా! మీరు మీ కుమారుణ్ణే ఎందుకు బలివ్వ కూడదు? హాయిగా స్వర్గానికి వెడతాడు కదా! అని రాశారు. అదే మాటను కొనసాగింపుగా సత్యకామ జాబాలిలో అనేక విధాలుగా సివి రాశారు. అది మనకు బృహత్కావ్యం అవడానికి కారణం ఆధునికమైన వాదోపవాదాలు, సంప్రదాయ వాదులేమంటారు? దానికి జాబాలి ఏం జవాబు చెప్తాడో ఊహించి సీవీ మహాద్భుతమైన కావ్యం రాశాడు.




ఇక విషాద భారతం, ఊళ్ళోకి స్వాములవారు వేంచేశారు, కారుచీకట్లో కాంతిరేఖ ఇవన్నీ చదివినప్పుడు సీవీకి కవిత్వం కంటే ప్రజలను చైతన్యవంతులను చేయడానికే రాశారు. ఇప్పుడొక చిన్న విషయం మనవి చేస్తాను. 1955 నాటికి అభ్యుదయ రచయితల సంఘం తన ఉత్సాహాన్ని కోల్పోయింది. చాలామంది రచయితలు, కవులలో నిస్సత్తువ ఆవహించింది. అప్పుడు తన చారిత్రక బాధ్యతను నెరవేర్చిన మహారచయితగా సీవీని నేను గౌరవిస్తాను. గజెల మల్లారెడ్డి తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతోంది అన్నారు. అప్పటికంటే తెల్లవారి లేవకముందే టీవీ ఛానళ్ళు మనమీద ఎంత భక్తిని కుమ్మరిస్తున్నాయి. ఒక మిత్రుడు నన్ను కలసినపుడు ఒక స్వామీజీ బాగా మాట్లాడుతున్నాడు మీరు ఎందుకు వెళ్ళకూడదన్నాడు. ప్రేక్షకులుగా ఎవరొస్తున్నారు అని అడిగాను. ఆయన చాలామంది వస్తున్నారు అన్నాడు. అందులో ఎవరైనా ఆటోడ్రైవర్స్ కానీ, చెప్పులు కుట్టే వాళ్ళు గానీ, చాకలి వాళ్ళుగానీ, మంగలి వాళ్ళు కానీ వున్నారా అని అడిగాను. అంటే కాదు కాదు మధ్య తరగతి విద్యావంతులు ఎక్కువ వున్నారు అన్నాడు. అవును. లంచగొండులు, దుర్మార్గులైన వాళ్ళకే పాపభీతి ఎక్కువగా వుంటుంది. మీరు ఏ స్వామీజీ ఉపన్యాసానికైనా వెళ్ళండి. ఎవరుంటారు? అక్కడెవరూ చెప్పులు కుట్టేవాడు వుండడు. ఒకసారి స్వామి సుందరచైతన్యను ఈ మాట అడిగాను. ఆయన చాలా మర్యాదగా నన్ను కోపగించుకోకుండా ఒక మాట చెప్పారు. మేమింకా వాళ్ళదాకా వెళ్ళలేదు. అంటే ఉన్నత విద్యావంతుల వరకే మేము వెళ్ళగలుగుతున్నాం. అది కూడా పాపభీతి ఉన్నవాళ్ళకేనా అంటే ఆయన నవ్వాడు. జవాబివ్వలేదు.

హేతువాద, నాస్తిక వుద్యమాల సంగతికి వస్తే, నేను,

నాకు బుద్ధి తెలిసినప్పటి నుండి హేతువాదినే, నాస్తికుణ్ణే. కానీ పెద్ద ధైర్యశాలిని కాను. హేతువాదాన్ని, నాస్తికత్వాన్ని ప్రచారం చేయాలనుకునే ఉద్దేశం లేదు. మత విశ్వాసాలు వాళ్ళవాళ్ళకుండనీ అని నేను నా మానాన జీవిస్తూ వచ్చాను. హేతువాదులు చాలామంది రాసిన గ్రంథాలు చదివాను. ముఖ్యంగా గోరాగారి ప్రసంగాలు విన్నాను. రావిపూడి వెంకటాద్రి రచనలు చదివాక , ఇప్పుడు సీవీ రచనలు చదివితే జీవితంలో ఆచరణ ఎంత ముఖ్యమో నాకు అర్థమైంది. అయితే ఆయన తన 85 ఏళ్ళ జీవితంలోనూ చెప్పిందీ, రాసిందీ వేరు కాదు. ఇక్కడే ఒక చిన్న సొంత సంగతి చెబుతాను. ఆయన ధనం కోసం రచనలు చేయలేదు. కీర్తి కోసం రచనలు చేయలేదు. చాలాసార్లు తాను నమ్మింది నిర్భయంగా, నిస్సంకోచంగా రాశారు. ఆ నిస్సంకోచంగా రాసినపుడు నాకు కొంచెం ఇబ్బంది కలిగింది. ఇటువంటి మొరటు మాటలు అక్కర్లేదేమో అని అనిపించింది. మొరార్జీ దేశాయ్, పుట్టపర్తి సాయిబాబా, ఇంకా చాలామందివి పేర్లు పెట్టారు. మహాకవి మహాప్రస్థానంలో ఎవరి పేరూ వుండదు. ఒక్క జనర్ధాన రావు గురించే వుంటుంది. అది తన మిత్రుడు కనుక. అంతేగాని శ్రీశ్రీ గారు చివర్లో ఓరోరి వెంగళప్పగా అని రాశాడు. అది కవిత్వంగా నేను మెచ్చుకోలేకపోయాను. రాసిన వెంటనే మళ్ళీ ఆయన 20 సూత్రాలపై పాట రాశాడు. భయంకరంగా ఇందిరాగాంధీ పరిపాలన, వామపక్ష నియంతృత్వం ఇటువంటి వైరుధ్యాలు నాకు సీవీ గారి రచనల్లో కనిపించలేదు. అంటే మనం చెప్పేది, ఆచరించేది ఒకటిగానే ఉండాలి. దీన్నే మన పెద్దవాళ్ళు త్రికరణశుద్ధి అంటారు. ఆలోచన, వాక్కు ఆచరణ. మరి మరొక్క అంశం చెప్పేసి నేను ముగిస్తాను. ముఖ్యంగా పారిస్ కమ్యూన్ గురించి చదివినప్పుడు ఎందుకో నాకు అంతగా వంటబట్టలేదు. ఇప్పుడు నేను మనవి చేసేదేమిటంటే మన విద్యాలయాల్లో ఫ్రెంచి విప్లవం, బోల్షివిక్ విప్లవం, చైనా విప్లవం, భారత స్వాతంత్ర సంగ్రామం అయిందో కాలేదో నన్న సందిగ్ధం కలిగింది. నేను మంచి చరిత్రోపాధ్యాయుల వద్ద చదువుకున్నాను. పారిస్ కమ్యూన్ అనే మాట నేను డిగ్రీ పాసయ్యే వరకు నా చెవిలో వేయలేదు. 1871లో ప్రజలు తిరుగుబాటు చేసిన ఆ స్థితి కొద్దిరోజులే మిగిలింది. కానీ చరిత్రలో చాలా విషాదం. కానీ ఆ పారిస్ కమ్యూన్ చదివినప్పుడు ఒక ఆశ్చర్యమేమిటంటే సీవీగారు ఇంగ్లీషులో ఆ పుస్తకాన్ని చదివి తెలుగులో కవిత్వం రాస్తే అంతబాగా వచ్చేది కాదు. నాకేమనిపించిందంటే, ఆయన ఆ పోరాటం మధ్యలో వున్నారు. ప్రజలతో మమేకం అయ్యారు. వాళ్ళ కన్నీళ్ళు తుడిచారు. మహాకవి శ్రీశ్రీ అన్నట్లు ఏడువకండేడువకండి అన్నట్లు అటువంటి స్థితిలో ప్రజలతో మమేకమై రాయబట్టే ఆ కావ్యం చదువుతున్నప్పుడు కొన్ని చోట్ల గద్గద కంఠంతో దాన్ని చదవలేకపోయాను. ప్రజలు తిరుగుబాటు చేసినపుడు అత్యంత ఉత్సాహంతో చదివాను. కాని చివర్లో అది నిలవలేదు అని గుర్తొచ్చాక దుఃఖపడ్డాను. యుఎస్ఎస్ఆర్ పతనమైనప్పుడు మాన్యుడు నండూరి రామ్మోహనరావుగారు దస్విదానియా అని ఒక సంపాదకీయం రాశారు. అందులో ఏమన్నారంటే మానవ జాతి కన్న కల చెదిరినట్లయింది. ఇప్పుడు నేను ముఖ్యంగా సీవీ గారికి మనవి చేసేదేమిటంటే ఇందాక ఆయన రాసిన చిన్న ఉపన్యాసం విన్నాక ఆయన రచనల్లాగే ఆయన ఆలోచిస్తున్నారు, కానీ ఆయన రచన చేసి పాతికేళ్ళయింది. 1990 నుండి 2015 దాకా వారేమి రాయలేదు. ఈలోపల సాయుధ పోరాటాలు జరిగాయి. అనేక మంది ప్రాణాలు బలైపోయాయి. ఈలోగా అనేక వుద్యమాలు జరిగాయి, రైతుల ఆందోళనలు జరిగాయి. వీటి గురించి కూడా సివి గారు రాయాలని కోరుకుంటున్నాను.

ప్రజలతో మమేకమై రాయబట్టే ఆ కావ్యం చదువుతున్నప్పుడు కొన్ని చోట్ల గద్గద కంఠంతో దాన్ని చదవలేకపోయాను. ప్రజలు తిరుగుబాటు చేసినపుడు అత్యంత ఉత్సాహంతో చదివాను. కాని చివర్లో అది నిలవలేదు అని గుర్తొచ్చాక దుఃఖపడ్డాను.

మహా రచయిత సీవీ రచనల అభిమానిగా నేను ఇక్కడ ఒక సంగతి తెలియచేయదలచు కున్నాను. తెలుగు దేశంలో గొప్పవాడివి కావాలంటే, ముందుగా చచ్చిపో అన్నాడు మహాకవి శ్రీశ్రీ. మనకు తెలుగువాళ్ళలో ఒక అశ్రద్ధ వుంది. ఒక మహారచయిత చనిపోయిన 20 ఏళ్ళ తర్వాత వాళ్ళ

## సి.వి. సమగ్ర రచనలు

| | | |
|---|---|---|
| 1. | సత్యకామ జాబాలి | 160/- |
| 2. | నరబలి | 75/- |
| 3. | పారిస్ కమ్యూన్ | 400/- |
| 4. | విషాద భారతం | 50/- |
| 5. | కారు చీకటిలో కాంతి రేఖ | 80/- |
| 6. | కావాలి మనకూ ఒక సాంస్కృతిక విప్లవం | 25/- |
| 7. | శ్రీశ్రీ ఖడ్గసృష్టి కావ్య పరామర్శ | 80/- |
| 8. | దళిత ఉద్యమ వైతాళికుడు కుసుమ ధర్మన్న కవీంద్రుడు | 60/- |
| 9. | మనుధర్మ శాస్త్రం శూద్ర దళిత బానిసత్వం | 60/- |
| 10. | కౌటిల్యుని అర్థశాస్త్రం పుట్టు పూర్వోత్తరాలు | 80/- |
| 11. | వర్ణ వ్యవస్థ | 100/- |
| 12. | ఆధునిక యుగంలో కుల వ్యవస్థ | 90/- |
| 13. | మధ్యయుగాల్లో కులవ్యవస్థ | 90/- |
| 14. | ప్రాచీన భారతంలో చార్వాకం | 70/- |
| 15. | సింధు నాగరికత | 80/- |
| 16. | స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ : మార్క్స్ | 40/- |
| 17. | ఆంధ్రాలో సాంఘిక తిరుగుబాటు ఉద్యమాలు | 60/- |
| 18. | భారతజాతీయ పునరుజ్జీవనం | 100/- |
| 19. | హోచిమన్ | 75/- |
| 20. | డార్విన్ పరిణామవాదం | 80/- |
| 21. | హేతువాద నాస్తికోద్యమం రంగనాయకమ్మకి సమాధానం | 40/- |
| 22. | హేతువాద నాస్తికోద్యమం రంగనాయకమ్మకి మళ్ళీ సమాధానం | 70/- |
| 23. | రామజన్మ భూమి బాబ్రీ మసీదు | 75/- |
| 24. | ఊళ్ళోకి స్వాములవారు వేంచేశారు | 80/- |

**సివి సమగ్ర రచనల ధర రూ.2120/- ప్రత్యేక సంచిక సందర్భంగా సాహిత్య ప్రస్థానం పాఠకులకు ప్రత్యేక తగ్గింపు ధర రూ. 1500/- మాత్రమే. విడి పుస్తకాలపై కూడా 25% తగ్గింపు ఉంటుంది. పోస్టేజి ఖర్చులు అదనం. ఈ అవకాశం సెప్టెంబర్ 10 వరకు ఉంటుంది.**

**డిడి/మనీ ఆర్డర్లు పంపవలసిన చిరునామా:**
**ప్రజాశక్తి బుక్‌హౌస్, కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ - 2,**
**సెల్: 9490099202**
**ల్యాండ్ లైన్: 0866-2577533**

సమగ్ర రచనలు వెలుగులోకొస్తాయి. నార్లవారివి, చలం గారివి, ఈవీ కృష్ణారావు గారివి, మరెందరివో. ప్రజాశక్తి పబ్లిషింగ్ హౌస్ చేసిన మహోత్తమమైన సేవ ఏమిటీ అంటే రచయిత జీవిత కాలంలోనే వాటన్నిటిని ఒకచోట చూచుకునే అవకాశం. ఇంకా గొప్ప విషయమేమిటంటే నన్ను గురించి సమకాలికులు ఏమనుకుంటున్నారు? నా తర్వాతి తరం ఏం ఆలోచిస్తుంది? అని రచయిత తెలుసుకునే అవకాశం.

ఇది రాచకొండ విశ్వనాథశాస్త్రి, చాగంటి సోమయాజులు ఇంకా అనేకమంది మహారచయితలకు లభించని అవకాశం. ఇవాళ సీవీగారు మనతో కూచుని ఇన్ని గంటలసేపు తన గురించి ఎవరెవరి అభిప్రాయాలేమిటో తెలుసుకునే అవకాశం కల్పించారు. ప్రజాశక్తి చేస్తున్న ఈ మంచిపని మనకు ఒక వరవడి కావాలి. రావిశాస్త్రిగారు ఒక మంచి మాటనేవారు. అదేమిటంటే మంచి పనులు చేయడంలో కాంపిటీషన్ బహు తక్కువ అని. ఇప్పుడు మనకు ఆంధ్ర దేశంలో అనేక విశ్వవిద్యాలయాలున్నాయి. ఇటువంటి సీవీ రచనల సమగ్ర సమాలోచన సదస్సులు విశ్వవిద్యాలయాల్లో జరగాలి. అంతేకాదు, మీ ప్రాంతంలో వున్న మహారచయితల్ని గుర్తించి మీరు జీవిత కాలంలోనే వాళ్ళ రచనలు వాళ్ళు చూసుకునేలాగా, వాళ్ళను గురించి ప్రజలు ఏమను కుంటున్నారో తెలుసు కునేలాగా చేయమని వేడుకుంటూ, ప్రజాశక్తి వారు ఇలా వచ్చినపుడు ఒక ఆశ్చర్యకరమైనది నేను ఆహ్వాన పత్రంలో చూశాను. 28 సంస్థల వారు వారికి తోడ్పాటుగా నిలవటం. అయితే నాకిప్పుడు కొంచెం ధైర్యం కలిగింది. ఆంధ్ర దేశం నేననుకున్నంత చేదుగా లేదుసుమా! చాలామంది ఈ ప్రాంతంలో ముందుకు వచ్చారు. అనేక ప్రాంతాల వాళు ్ళ నాకు ఈరోజు సభలో పరిచయ మయ్యారు. ఇట్లా అనేక ప్రాంతాల వాళ్ళు ఒక సాహిత్య సభకు రావడం కూడా నాకు అపురూపంగా కనిపిస్తున్న అంశం. ఈ సభ నిర్వహణకు కృషిచేసిన మిత్రులందరికీ నా ఆనందాన్ని, అభినందనని తెలియచేస్తున్నాను.

# ఒక సాంస్కృతిక విప్లవ జ్వాల సీవీ




◆ కత్తి పద్మారావు

ఈ రోజు వర్గమూ, కులమూ, సీవీ రచనలూ అనే అంశం భారతదేశ సాంస్కృతిక విప్లవానికి పునాది అంశంగా నేను భావిస్తున్నాను. సీవీ గారి రచనల్ని ప్రజాశక్తి వారు ఒక సమూహంగా తీసుకురావడాన్ని అభినందించాలి. సీవీ గారు ఒక తాత్వికుడు. ఆయన. ఒక తాత్విక, ఒక సామాజిక, ఒక సాంస్కృతిక విప్లవ జ్వాల రగిలించిన వాడు సీవీ. సీవీని అర్థం చేసుకోవడమంటే మార్క్సును అర్థం చేసుకోవడం, అంబేడ్కర్‌ను అర్థం చేసుకోవడం, లెనిన్‌ను అర్థం చేసుకోవడం, మహాత్మా పూలేను అర్థం చేసుకోవడం, కమ్యూనిస్టు మానిఫెస్టోను అర్థం చేసుకోవడం, కుల నిర్మూలనను అర్థం చేసుకోవడం. రెండు పార్శ్వాలను అర్థం చేసుకునే బృహత్తరమైన ఒక సాహితీ సమూహాన్ని ఆయన సృష్టించాడు, మనమందరం కూడా ఆయనకు అభినందనలు తెలపాలి. సీవీ అంటే నేననుకుంటాను. కమ్యూనిస్టు మానిఫెస్టో, కుల నిర్మూలన. రెండూ కలిపితే సీవీ అనేక సందర్భాల్లో అనేక పరిస్థితుల్లో మనమెక్కువగా ఒకే పార్శ్వాన్ని అధ్యయనం చేస్తూ వుంటాం. సహజంగా మనం ఆ ఇంప్రెషన్స్‌తో మార్క్సును చదవడానికే మన జీవితకాలం సరిపోతుంది.

మార్క్స్, ఏంగెల్స్, కాంట్, ఆ తర్వాత లెనిన్ వీటికే సరిపోతుంది. మళ్ళీ సోషల్ ఏరియాలోకి అతనొచ్చేలోపు ఆయన జీవిత కాలం పూర్తయిపోతుంది. అలాగని సామాజిక శాస్త్రవేత్తలు అనుకున్నాక మహాత్మా పూలే, అంబేడ్కర్, పెరియారే, మనుస్మృతి, వేదాలు, ఉపనిషత్తులు, ఇవయ్యేటప్పటికి ఒక జీవితకాలం అయిపోతుంది. అప్పుడు మార్క్సును చదివే టైమ్ ఉండదు. అలాగాకుండా ఇద్దర్ని సమన్వయంగా చదివిన వాడు అధ్యయనం చేసినవాడు, అందించిన వాడు, సీవీగా మనందరం అర్థం చేసుకోవాల్సిన అవసరం వుంది. ఇటీవల నేను మార్క్స్ మీద అంబేడ్కర్ మీద కూడా వ్యక్తిత్వ నిర్మాణ మనే గ్రంథం రాసినపుడు ఇద్దరికీ చాలా పోలికలు కనిపించాయి. లండన్‌లో ఈయనా చదివాడు, లండన్‌లో ఆయనా చదివాడు. ఈయన ఒక ఫిలాసఫర్‌గా, ఒక హెగెల్‌ని, కాంట్‌ని, జర్మన్ ఐడియాలజీని, తరువాత భౌతిక వాదాన్ని ముఖ్యంగా భౌతిక వాద గతి తర్కమని ఈయనొక అన్వయం క్రియేట్ చేసి అటు ఫ్యూర్‌బాని, ఇటు హెగెల్‌ని అన్వయించి, సమాజ గతి తార్కిక భౌతిక వాదాన్ని సృష్టించిన వాడిగా మార్క్స్ ప్రపంచ పరిణామానికి ఈనాటికి కూడా ప్రపంచంలో జరుగుతున్న ప్రతి విషయాన్ని ఆయన వెలుగులో చూడాల్సిన స్థాయికి తీసుకువచ్చాడు.

అంబేడ్కర్‌ని చూస్తే కూడా ప్రపంచాన్ని మార్చిన తత్వవేత్తగా మనకు కనిపిస్తాడు. మార్క్ కన్నా ఇంకా వెసులుబాటు వుంది. అంబేడ్కర్‌కి ఆ వెసులుబాటు లేదు. బ్రాహ్మలందరూ చెడ్డవాళ్ళని కాదు. కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు, రాజా రామమోహన్‌రాయ్, కొన్ని వందల మంది ఈ సమాజంకోసం పనిచేశారు. వారిని కుల దృష్టితో చూస్తే మనకు కుల దృక్పథమున్నట్లు. మెజారిటీ ప్రజల జీవన విధానంలో తెలుగు లేదు. వారికి తెలుగు

రాదు. నేను పన్నెండుమంది బ్రాహ్మణులతో కలిసి పనిచేశాను. ఎందుకు రాదు? తత్సమ పదాల మీద వారికి మక్కువ. తత్సమ పదాలు అంటే సంస్కృతం నుండి వచ్చిన పదాలు. కానీ సీవీ తెలుగు పదాల్లో రాశాడు. అప్పటికి సీవీ చార్వాకం, బేదాలను చదివారు. భారత దర్శనాల్లో ఆరు దర్శనాలు భౌతిక దర్శనాలే. అదే మార్క్స్ ఇప్పుడు ఉంటే వీటిమీద రాసేవాడు.

మార్క్స్ జర్మన్ ఐడియాలజీలో రాస్తూ భౌతిక వాదుల్ని, భావవాదుల్ని వేరు చేసిన గొప్ప తాత్వికుడాయన.

ఒక తాత్వికుడిగా. అయితే సీవీ దగ్గరికి వచ్చేటప్పటికి నేనొక భాషలో అందిస్తున్నాను. ఎంత పెద్ద విషయమిది? వందకు వంద మార్క్సిస్టు సీవీ. చాలామందికి జీవితం లేదు. ఆయనకు జీవితం ఉంది. సింపుల్‌గా వుంటాడు. తక్కువ ఆహారం తీసుకుంటాడు. ఆర్భాటాల్లేవు. వేదిక మీదకి రాడు. రాసినన్నాళ్ళు రాస్తూనే వున్నాడు. ఇక చదువంటారా? అపారమైన చదువు. మనుస్మృతి, పరాశర స్మృతి, నారద స్మృతి ఒక పక్క చరిత్ర కొశాంబి, ఆర్.ఎస్.శర్మ, బిపిన్ చంద్ర, వీళ్ళే గాదు, ఇక తెలుగులో కొచ్చేటప్పటికి మూలగ్రంథాలన్నీ ఒక త్రిపురనేని రామస్వామి, సూతపురాణం, యాంటీ థీసెస్ గ్రంథాలవి. వాళ్ళకు పరిమితులుంటాయి. ప్రతివాడిని మార్క్స్‌తో కొలిస్తే కుదరదు. అనేక మందికి వాళ్ళ విప్లవాల్లో వాళ్ళకు పరిమితులున్నాయి. సీవీ అనేవాడే లేకపోతే ఈనాడు ఆంధ్రదేశ సాంస్కృతిక చరిత్ర లేదు, సాంఘిక చరిత్రలేదు. ఈ సమాజాన్ని మార్చే శక్తులకు కూడా కులాన్ని అంటగట్టవద్దు. వారికి విసుగేస్తుంది. అంబేద్కర్ అందర్ని పరామర్శించాడు. ఆయన జాతీయోద్యమ కాలంలో మరి ముగ్గురి మీద రాశాడు. కుల నిర్మూలన థీసెస్ ముగ్గురి మీద రాశాడు. మరి గాంధీ గురించి అంబేద్కర్ ఏమి చెప్పాడు. మతవాది అని చెప్పాడు. అదీ సీవీ గొప్పదనం. ఈ కులం అనేదానికి పునాది హిందూమతంలో వుంది. హిందూ సామ్రాజ్యవాదమది. హిందూ అంటే మతం కాదు, హిందూ అంటే రాజ్యం. హిందూ అంటే కేవలం మతమే కాదు, అది ఎకనమిక్స్ అని చెప్పినవాడు సీవీ. అద్భుతమైనటువంటి విశ్లేషణ. నాకు తెలిసి ఇటీవల బ్రాహ్మణవాద మూలాలను వ్రాస్తూ కాపిటల్ రాసినట్లే మనం రాయాలని అనుకున్నాను. అంటే క్యాపిటల్ అంటే ఏమిటి? ఒక పెట్టుబడిదారుడికుండే లక్షణాలన్నీ బ్రాహ్మణ వాది కెలా వుంటాయని నేను అప్లయ్ చేయాలని కాపిటల్ చాలా తీక్షణంగా చదివితే మార్క్స్ ఏం చేశాడు. క్యాపిటలిస్ట్‌కు అన్ని లక్షణాలుంటాయి. అన్నీ మేనేజ్ చేస్తాడు. కులాన్ని, మతాన్ని, వర్గాన్ని, వ్యాపారస్తుణ్ణి, ఇలా అందర్నీ మేనేజ్ చేస్తాడు.



ఫొటోలో సిపిఐ నాయకులు రామకృష్ణను చూడవచ్చు.

మోడీ వున్నాడు. ఆయనకు రాముడు, కృష్ణుడు అవసరం. రెండే పాత్రలు. పాలకవర్గానికి రెండు యాక్షన్స్ వున్నవి. ఒకటి రామా యాక్షన్ వుండాలి, ఒకటి కృష్ణా యాక్షన్ వుండాలి. . నేను రాముడివి కొన్ని తీసుకున్నాను, కృష్ణుడివి కొన్ని తీసుకున్నాను. అన్నారు. కృష్ణుడంటే శృంగారమని కాదు, . మనమంత అంటగట్టక్కర్లేదు. రాజకీయ తంత్రం. చేతిలో ఆయుధం పట్టుకున్నా చెప్పేవి సున్నితమైన వాక్యాలు. కృష్ణుడికి ఒక చేతిలో ఆయుధం ఉంటుంది, ఇంకో చేతిలో మురళి వుంటుంది. ఆయుధం ఎప్పుడోగాని తీయడు. మురళి నిరంతరం మోగుతూనే ఉంటుంది. ఆయుధం, ముస్లింలు కనపడ్డపుడో, మార్క్సిస్టులు కనపడ్డపుడో తీస్తాడు.

మోడీగారు అలాగే ఆయుధాన్ని ఎప్పుడో తీస్తాడు. బయట మాత్రం మురళి తీస్తాడు. యోగా, ఏదో ఊదవటం ఏదో చేస్తాడు. ఒక పాలకుల్లో వుండే అవతారాలు అర్థం చేసుకోవాలంటే సీవీ పుస్తకాలు చదవాల్సిందే. మార్క్స్‌తోపాటు అంబేద్కర్‌ని కూడా చదవండి ఇది నా విజ్ఞప్తి. చాలామంది బ్రాహ్మణులకి అస్పృశ్యతా భావం వుంటుంది. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, మావో 200 పేర్లు అప్పచెబుతారు. కానీ అంబేద్కర్ అనడు. పెటీ బూర్జువా అనేస్తాడు. ఎందుకు పెటీ బూర్జువా అంటాడు. ముఖం నుంచి బ్రాహ్మణులు బుట్టిరి, భుజాల నుండి క్షత్రియులు బుట్టిరి, ఊరువుల నుండి

వైశ్యులు బుట్టిరి, పాదముల నుండి శూద్రులు పుట్టిరి. జోక్ చేశారు సీవీగారు. మరి ఐదోవాడు ఎక్కడ్నించి పుట్టాడు? అసలు అలా పుట్టటమేంటి? మొఖాల నుంచి చేతుల నుంచి పుట్టటమేమిటి. అప్పుడు ఆపరేషన్ థియేటర్లు ఎన్ని రకాలుంటాయి. అసలీ గోలంతా ఏమిటి? డార్విన్ పరిణామ క్రమాన్ని రాశాడాయన. మనిషి, మానవుడు పరిణామం నుండి వస్తాడు గనుక ఏ కులానికి ఏ మనిషి పుట్టడు అని తేల్చి పారేసిన సీవి గారికి మనందరమూ కూడా అభినందనలు చెప్పాలి. కమ్యూనిస్టులు చదివినంత ఎవరు చదివారు? పాపం చాలా చదివారు. కానీ ఇండియన్ సిస్టంలో భారతదేశాన్ని అర్థం చేసుకోవడానికి ఒక చార్వాక దర్శనం చదవమని ఆయన అన్నాడు. 28 శ్లోకాలండి. నేను రాసేటప్పుడు. చార్వాక దర్శనం నేను కూడా రాశా. గురువుగారు కొంత చెప్పాడు మనం కూడా కొంత చెప్దాం అని రాశా. దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ, 'వాటీజ్ లివింగ్ అండ్ వాటీజ్ డెడ్ ఇన్ ఇండియన్ ఫిలాసఫీ', ఇండియన్ ఎతిజం, అన్నీ చదివా. నేను కూడా చదివి రాశాను. కానీ రాహుల్ సాంకృత్యాయన్ ఆయనను బ్రాహ్మణుడుగా ఎవడు చూడగలడు. ఈవేళ అన్ని దేశాలకు బౌద్ధాన్ని తీసుకెళ్ళినవాడు. అక్కడి నుండి సాహిత్యాన్ని ఇక్కడకు తీసుకువచ్చాడు. తనకంటే ముందెళ్ళింది బౌద్ధం దాన్ని తీసుకొచ్చాడు.

ఎవడన్నా బ్రాహ్మణాధిపత్యాన్ని ఎదిరిస్తే వాణ్ణి చంపేస్తారు. వాడి పేరెత్తరు. ముందు ఎన్ని వేదికలకన్నా వెళ్ళు. నీ పేరు లేకుండా మాట్లాడతాడు. నీ పేరు కోట్ చేయడు. బ్రాహ్మణుడియొక్క గొప్పతనమేమిటంటే ఒక సారి విశ్వనాథ సత్యనారాయణ చెప్పాడు. నేను శ్రీశ్రీ పేరునైనా కోట్ చేస్తాను గాని, జాషువా పేరు కోట్ చేయను. శ్రీశ్రీ పేరు కోట్ చేస్తే నాకు పోయేదేమీ లేదు. మావాడికన్నా చేయండి నాకన్నా చేయండి సన్మానం. జాషువాకు చేయొద్దన్నాడు. అంత ఇంటర్నల్ నెట్‌వర్క్ వుండేది ఆరోజుల్లో. కానీ ఈరోజుల్లో అదేమీ లేదు. అందరూ ఫెయిర్‌గున్నారు. ఎవ్వడి కులమేంటో తెలియదు. అన్ని చొక్కాలొక్కటే. ఎక్కడో కొన్నయ్ కంపెనీ చొక్కాలు. అన్ని సెల్‌ఫోన్లు కూడా కంపెనీవే. చైనాయే. ఎవ్వడి కాస్టేంటో తెలియడానికి అసలు అవకాశం లేదు. కానీ ఫోటోలన్నీ క్యాస్టేయే వుంటయి. మ్యారేజీ ఫోటోలుంటయి. పెళ్ళిళ్ళకని మ్యారేజీ బ్యూరోలుంటయి. అంటే ఈ కుల ఆచరణ పోవాలనే సీవీ చెప్తాడు. వర్ణ వ్యవస్థలో ఆయన చెప్పిన పెద్ద విషయమేమిటంటే వర్ణవ్యవస్థను భగ్నం చేయాలంటే జీవన విధానాన్ని మార్చాలి. జీవన విధానమంటే ఏమిటి? మార్క్స్‌కు జీవన విధానమేంటి? ఆయన జూ అని ఎవడైనా అనగలడా? ఆయన పారిస్ పారిపోయి ఆ తర్వాత లండన్ లో వుండి, పిల్లలు చనిపోయి, ఆ తర్వాత పిల్లలు స్మశానికెళుతున్నప్పుడు కూడా ఆ పెట్టెక్కూడా డబ్బుల్లేకుండా చచ్చిన ఆ పేదరికాన్ని నువ్ చెప్తున్నావ్..

ఆంధ్రదేశంలో వున్న లైబ్రరీలన్నిటికి సీవీ వెళ్ళాడు. అసలు ఎంత చదివారంటే మీకు తెలియదు. శ్రీశ్రీ గారంటే మాకే సిగ్గేస్తది. చదివానా, లేదా అని నాకే డౌటొస్తుంది. ఎందుకంటే ఆయన అనుచరులమే మేము కూడా. ఎక్కడ లైబ్రరీ కనపడితే అక్కడ, ఎక్కడ పుస్తకాల షాపు కనబడితే అక్కడ ఇన్ని చేస్తే నాకు చివరికి 27 వేల పుస్తకాలైనయ్. ఇంట్లో ఏమీ లేవు పుస్తకాలు తప్ప. పడుకోవాలన్నా పుస్తకాలే తలకింద దిండుగా. ఏదో మా ఆవిడ హేతువాది కాబట్టి ఉంటుంది. లేకపోతే వెళ్లిపోయేది. ఇప్పుడు, టీవీ, సెల్‌ఫోన్లు కులాన్ని రద్దు చేస్తున్నాయ్. కానీ అంతర్గతంగా వున్న కులాన్ని బట్టుకున్నాడు సీవీ. ఎక్స్‌టర్నల్‌గా ఎంతైనా మారొచ్చు మానవుడు. వర్గము, కులము. వర్గం కోసం పోరాడాలన్నా వర్గమెక్కడా కనపడటం లేదు. కార్మికులను కూడా మిడిల్ క్లాస్ చేసేశారు. వాడికో సెల్‌ఫోన్ ఇచ్చేశారు. వాడికో టీవీ ఇచ్చేశారు. వాడికో మందుబాటిల్. అదీ పాలకవర్గం కుట్ర. అదీ పెట్టుబడిలో చెప్పింది అదే. వర్ణ వ్యవస్థలో చెప్పిందదే.

సింధూ నాగరికతలో ఆయన అద్భుతం. ఋగ్వేద కాలం భారతదేశం అంటున్నారు. కాదు ఈ దేశం యొక్క పూర్వ చరిత్ర కావాల్సిన అవసరమైంది. తవ్వి తీస్తే సింధు నాగరికత.

ముత్యాలు మోసుకెళ్తున్నాడు. ఎవరు? ముఖ్యమంత్రి. ఎవరికి? సీతాదేవికి. ఇవాళ ఒక దళిత తల్లి ఆమెకు ఇంతవరకు భూమిలేదు. ఒక్క ఎకరం భూమి కూడా లేని పది గ్రామాలు మొన్న మేము చూశాం. ఓటర్ లిస్టులో పేరు ఉంది, ఒక ఎకరం భూమి కూడా లేదు. ఎందుకు లేదు? అది వర్గం. ఆమెని ఒసే అంటున్నారు. ఇంకొక వర్గం. ఇది కులం, ఇది అస్పృశ్యత. ఈ రెండూ ఒకామెకు తాకిడి అయిపోయినై. ఈమె పొలమడిగితే ఓసే అంటున్నారు. ఈమెకి ఎకరం భూమి లేదు.ఆ ఒసే పోద్దంట. రెండూ కలిపేద్దాం అంటాం మేం. పెద్ద తేడా ఏమీ లేదు. ఆయనకీ నాకు పెద్ద తేడా లేదు. అంబేద్కర్ విగ్రహం

ఆవిష్కరించినపుడు మేమేం చెపుతాం. ఊర్లో కమ్మవార్లారా, రెడ్డివార్లారా మీకు ఒరే అనే హక్కు లేదు. మానవులందరూ సమానం. మీరు సువార్తను సువార్తనే పిలువు. మార్తను మార్తనే పిలువు. కోటమ్మని కోటమ్మనే పిలువు. నువ్వు ఒరే అంటే ఎస్సీ, ఎస్టీ ప్రివెంటివ్ ఆఫ్ ఎట్రాసి........యాక్ట్ కింద నిన్ను లోన దోయిస్తాం. డా. బి.ఆర్. అంబేద్కర్ ఇచ్చిన ఈ రాజ్యాంగం ప్రకారం నేరస్తుడివి. ఈ దేశంలో నేరస్తులు కాని వాళ్ళెవరన్నా వున్నారా? అంటే నువ్వు ఒరే, ఒసే అనకుండా మారాలి. మానవులుగా చూసినపుడు మాత్రమే నువ్వు రాజ్యాంగ బద్ధుడివి అని చెపుతూ వుంటాం అక్కడ. అది మార్క్సిజమే.

మేం కారంచేడు పోరాటాలను టేకప్ చేసినపుడు చంద్ర రాజేశ్వరరావు గారు వచ్చారు, అన్ని పార్టీలు ఎంఎల్ పార్టీల వాళ్ళు వచ్చారు. వాళ్ళేం చెప్పారు ఇంటర్నషనల్‌గా. ఎస్. దళతులకొక ఉద్యమం కావాల్సిందే. దానికి క్యాస్ట్, క్లాస్ నేచరుండాలి. పుట్టి క్యాస్ట్ నేచర్ కాదు. క్యాస్ట్ అండ్ క్లాస్ నేచరుండాలి అన్నాడు. ఎస్. మేంకూడా ఏమన్నాం. కమ్మ భూస్వాములు అన్నాం. చాలామంది ఎందుకీ కమ్మలు లేనిపోనిది అనవసరంగా. రెడ్లు భూస్వాములున్నారు. కాపులు భూస్వాములున్నారు. అయితే ఏమైంది? పెట్టుబడిదార్లు టాటాని, బిర్లాని అందర్నీ అనాలిసిస్ చేసి టాటా, బిర్లా నరికేరంటే మనకేం బోయింది. రెడ్డి వారు నరికేరంటే మనకేం బోయింది. కమ్మ వారు నరికేరంటే మనకేం బోయింది. అంటే చివరికి అక్కడున్నటువంటి పేద కమ్మలు కూడా బరిసెలు తీసుకొచ్చాడు. కాబట్టి అక్కడ క్యాస్ట్ క్లాస్ ఇంక్లూడయింది. వాళ్ళను రెచ్చగొట్టారు. రేయ్ అని రెచ్చగొట్టారు. ఇక్కడ మాదిగోడు పాపం ఎవడైనా చచ్చిపోయాడు. పొలమున్నవాడూ చచ్చిపోయాడు. పొలం లేనివాడూ చచ్చిపోయాడు. ఇక్కడ క్యాస్ట్ క్లాస్ దాడి జరిగేటప్పుడు అని మేము చెప్పి అనాలిసిస్ చేసి దళితుల ఉద్యమం స్టార్ట్ చేశాము. . ఇప్పుడు మోడీ సంస్కృతికి విప్లవమేమిటి? ఆయన తీసుకొస్తున్న పాఠ్య గ్రంథాలలో రాముడు, కృష్ణుడు, పరశురాముడు, యోగా, గీత ఇదంతా ఏమిటి? అసలు మనం మళ్ళీ మన జాషువాని, మళ్ళీ మన కుసుమ ధర్మన్నను, మళ్ళీ త్రిపురనేనిని, మళ్ళీ వేమనను, మళ్ళీ మన తెలుగులో వున్న విప్లవకారుల్ని తీసుకొద్దాం అని ప్రజాశక్తి తీసుకున్న నిర్ణయంతో దళితులు చైతన్యంతో చేయి కలుపుతున్నారు. ఎస్. మనం మనం కలిసి ముందుకు నడుద్దాం. వద్దు. మనకు విభేదాలొద్దు. మనందరం పోరాడేవాళ్ళమే కొద్దికొద్దిగా తేడాలున్నాయి. మేము అంబేడ్కర్‌ని చదువుతున్నాం. మీరు లెనిన్, మార్క్సని చదువుతున్నారు. కొద్దిగా అటూ యిటూ చదువుదాం. చాలామంది మార్క్సిస్టు ఇళ్ళకు నేను వెళ్ళినపుడు అంబేడ్కర్ పుస్తకాలు అసలు వుండవు. ఫొటో మాత్రం వుంటుంది. కాబట్టి నేననేదేంటంటే కులమూ, అస్పృశ్యతా నివారణ, వర్గపోరాట శక్తులు కలవాలి.

మార్క్సకి అంబేడ్కర్‌కి తెలుసు. తామేం చెబుతున్నారో. సీవీ గారికి తెలుసు తానేం చెప్పాడో. అందుకనే 25 సంవత్సరాల తర్వాత ఈ బుక్స్ రిలవెన్స్ పెరిగింది. మళ్ళీ పుర్రెల్ని బయటికి తీశాం. మళ్ళీ శిలాశాసనం, గొడ్డళ్ళు బైటికి తీశాం. గొడ్డలి వాడొద్దు. అవసరమైతే వాడతాం ఏమైంది? అంటే గొడ్డలి ఎందుకు వాడాలి? అదికాకపోతే ఇంకోటి ఎందుకు వాడాలి? 'ఒసే సువార్త' అంటే కొడవలి తీసుకుని వేసింది. అది రివల్యూషనే. ఏం 'ఒసే సువార్తా' అన్నా నిన్ను చౌదరిగారూ అంటదా ఏంటి? ఏసుద్ది. అన్నాను నేను. నిన్ను కూడా జైల్లో పెడతాం. ఎస్. జైలు కెళదాం. కాన్స్టిట్యూషన్ గీతలు కూడా దాటతాం. ఏమవుతుంది? ఈ దేశంలో మనకి ఒక కుల, వర్గ పరిధుల్ని రద్దు చేయాలన్నప్పుడు, గేటు తెరవాలన్నప్పుడు మన కాలికొకటి గాయమవుతుంది. ఎస్. మనం జైలుకు కూడా సిద్ధపడాలి. అవును ఎమర్జెన్సీ రానివ్వండి. మళ్ళీ లోనకు వెళతాం. మళ్ళీ మాట్లాడుకుందాం. మళ్ళీ మనుస్మృతి చదువుదాం. మళ్ళీ పరాశర స్మృతి చదువుదాం. మళ్ళీ సీవీని చదువుదాం. కుల నిర్మూలన సమితి, కుల వివక్ష పోరాట సమితి కావొచ్చు. అది ట్రేడ్ యూనియన్ కావొచ్చు. అది ఇంకోటి కావచ్చు. ఆ పిలుపు కల్చరల్ పిలుపు కావాలి. అది అస్పృశ్యతా నివారణను గురించిన పిలుపవ్వాలి. దళితులకు భూమి ఇవ్వాలనే పిలుపు కావాలి. అంటం. రోజూ అంటం వేరు. ఒక్క ఎకరం ఇవ్వలేదు ఇప్పటివరకు చంద్రబాబు. ఒక్క తుళ్ళూరు. మా పిల్లనిచ్చాం. మా యింట్లో ఎవరూ ఎస్సీ అమ్మాయి లేదు. కంసాలి, మున్నూరు కాపు, ఒక తమిళ వాయిస్ అందర్నీ చేసుకున్నాం. అందరూ మనుషలే. ఆళ్ళకి పిల్లలు పుట్టారు. డెమొక్రటిక్ గా వుంటే చాలు. వాళ్ళ దగ్గర మనమేం తీసుకోకుండా వాళ్ళను గౌరవిస్తేచాలు ఏ అమ్మాయయినా కాపురం చేస్తుంది. ఇవాళ పిల్లలు కూడా పుట్టారు వాళ్ళు బాగా చదువుకుంటున్నారు. ఆ తుళ్ళూరులో 50 వేల మంది ఎస్సీలు, బీసీలు, ఎస్టీలు ఇవాళ భూమిలేని వాళ్ళని చంద్రబాబు దోచుకోబోయి అంటే వాళ్ళని నిరాశ్రయుల్ని

## వట్టికోట ఆళ్వారుస్వామి స్మారక రచనల పోటీ

తెలంగాణ వైతాళికుడు, ప్రజా రచయిత, ఉద్యమకర్త, కమ్యూనిస్టు నేత, సకల ఉద్యమాల్లో క్రియాశీలక భాగస్వామిగా నిలచి సాహిత్యప్రపంచానికి ఆదర్శమూర్తిగా ప్రసిద్ధి చెందిన వట్టికోట ఆళ్వారుస్వామి శతజయంతి సంవత్సరమిది. అసమ సమాజంలో ఉద్యమశీలిగా ఉండటం రచయిత కర్తవ్యమని తన జీవితాచరణ ద్వారా నిరూపించిన అసలుసిసలు ప్రజారచయిత ఆళ్వారుస్వామి. తెలంగాణ తొలి తెలుగు నవలాకారునిగా ప్రసిద్ధి చెందిన వట్టికోట ఆళ్వారుస్వామి స్మారక రచనల పోటీని నిర్వహించాలని 'నవతెలంగాణ' సంకల్పించింది. తన రచనల ద్వారా, ఉద్యమాచరణ ద్వారా సాహిత్యకారులు ఎలా ఉండాల్లో మార్గనిర్దేశం చేసిన ఆళ్వారుస్వామికి ఈ రూపంలో ప్రకటిస్తున్న నివాళి ఇది. ప్రజలపక్షం వహించడం సాహిత్యకారుల ధర్మమని, నికార్సయిన కర్తవ్యమని చెప్పకనే చెప్పిన సాహిత్యయోధుడు ఆళ్వారుస్వామి స్ఫూర్తి, దీప్తి ఈతరం అందిపుచ్చుకోవాలన్న ఆకాంక్షనే ఈ రచనల పోటీల నిర్వహణకు మూలం. కనుక ఎక్కడున్నా, ఏం చేస్తున్నా రచనలు చేసే సృజనాత్మక సామర్థ్యమున్న తెలుగు కవుల్నీ, రచయితల్నీ ఈ పోటీల్లో పాల్గొనాల్సిందిగా ఆహ్వానిస్తున్నాం. నవల, కథ, కవిత ప్రక్రియల్లో ఈ పోటీల్ని నిర్వహిస్తున్నాం. నవలల పోటీ: ప్రథమ బహుమతి: రూ. 25,000, ద్వితీయ బహుమతి: రూ. 15,000, తృతీయ బహుమతి: రూ. 10,000, కథల పోటీ: ప్రథమ బహుమతి: రూ. 10,000, ద్వితీయ బహుమతి: రూ. 8,000, తృతీయ బహుమతి: రూ. 5,000, పది కథలకు ప్రత్యేక బహుమతులు: ఒక్కొక్క కథకి రూ. 1,000, కవితల పోటీ: ప్రథమ బహుమతి: రూ. 3,000, ద్వితీయ బహుమతి: రూ. 2,000, తృతీయ బహుమతి: రూ. 1,000, పది కవితలకు ప్రత్యేక బహుమతులు: ఒక్కొక్క కవితకి రూ. 500, రచనలు పంపవలసిన చిరునామా: ఎడిటర్, నవతెలంగాణ, ప్లాట్ నెం: 21/1, యం.హెచ్.భవన్, ఆర్‌టిసి కళ్యాణ మండపం దగ్గర, అజామాబాద్ ఇండస్ట్రియల్ ఏరియా, హైదరాబాద్-500 020, **రచనలు ఎలా ఉండాలంటే...** సమకాలీన సామాజిక జీవితాన్ని ప్రతిబింబించాలి. ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రకంపనలకు లోనవుతున్న బతుకుతీరును, దైనందిన జీవితంలోని సంక్లిష్టతల్ని, సంక్షోభాల్ని అభివ్యక్తం చేయాలి. చరిత్ర, పోరాటాల నేపథ్యాన్ని వస్తువుగా తీసుకున్నప్పటికీ వాస్తవాల ప్రాతిపదికగా చారిత్రక సంఘటనల్ని కళాత్మకంగా సృజించాలి. అణచివేతకు గురయ్యే వర్గాల గురించి ఆలోచింపజేసే ఆర్ద్రమైన ఇతివృత్తాలై ఉండాలి. కనిపించే వాస్తవాల వెనుక ఉండే సూక్ష్మమైన వైరుధ్యాల్ని గుర్తించి చిత్రించే నైపుణ్యం ప్రధానం. వస్తువుతో పాటు శైలీశిల్పాలు సమగ్రంగా, పరిపూర్ణంగా ఉండాలి. ఇతివృత్తం ఎంత ముఖ్యమో, దానికి కళారూపం ఇవ్వడంలో సౌందర్యం అంతే ప్రధానమని రచయితలు, కవులు గుర్తించాలి. **నిబంధనలు- సూచనలు:** కవితలకీ, కథలకీ పేజీల కొలమానం లేదు. రచన సమగ్రంగా ఉండడమే ముఖ్యం. ఎన్ని లైన్లు, ఎన్ని పేజీలు ఉండాలన్నది ఇతివృత్తాన్ని బట్టి నిర్ణయించుకోవాలి. నవలలు మాత్రం 150 నుంచి 250 పేజీల (ప్రచురణలో 1/8 పుస్తకం సైజు) మధ్యలో ఉండాలి. రచనలపై రచయిత పేరు, చిరునామా రాయకూడదు. హామీపత్రం పేజీలో రాయాలి. ఒక రచన ఇదివరలో ఎక్కడా ప్రసారం కాలేదని, ప్రచురితం కాలేదని, ఏ వెబ్‌సైట్‌లోనూ, బ్లాగులోనూ, ఫేస్‌బుక్‌లోనూ ఉపయోగించలేదన్న హామీ పత్రం జత చేయాలి. రచనలు తిప్పి పంపడం కుదరదు. కనుక ఒక జిరాక్స్ కాపీని రచయితలు తమ దగ్గర ఉంచుకోవాలి. పోటీలో బహుమతి గెలుచుకున్న, సాధారణ ప్రచురణకు ఎంపికయిన కవితల్ని, కథల్ని నవతెలంగాణ ఆదివారం సంచిక 'సోపతి'లో ప్రచురిస్తాం. తర్వాత వీటిని పుస్తకాలుగా, సంకలనాలుగా వెలువరించడం జరుగుతుంది. నవలల పోటీలో బహుమతి గెలుచుకునే నవలల్ని 'నవతెలంగాణ పబ్లిషింగ్ హౌస్' పుస్తకాల రూపంలో వెలువరిస్తుంది. బహుమతి కోసం ఎంపికయ్యే మూడు నవలలే గాక ప్రచురణకు అర్హమనిపించే రచనల్ని ఈ ప్రచురణ సంస్థ పుస్తకరూపంలో వెలువరిస్తుంది. దీనికి అంగీకరించేవారు మాత్రమే ఈ పోటీలో పాల్గొనాలి. రచనల ఎంపిక విషయంలో తుదినిర్ణయం నవతెలంగాణ సంపాదకవర్గానిదే. ఈ విషయంలో ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలకు, ఫోన్లలో సంప్రదింపులకు తావులేదు. కవరు మీద 'వట్టికోట ఆళ్వారుస్వామి రచనల పోటీకి' అని తప్పనిసరిగా రాయాలి. కథలు, కవితలు చేరవలసిన ఆఖరు తేదీ: 30 సెప్టెంబర్ 2015. నవలలు చేరవలసిన ఆఖరు తేదీ: 15 అక్టోబర్ 2015

చేయబోతున్నాడు. ఎస్. ఆ విషయంలో మనందరం కలిసి పోరాడాల్సిందే. ఈ దేశంలో పాలకవర్గం యొక్క మతం, ఈ దేశంలో పాలకవర్గం యొక్క కులం, పాలకవర్గం యొక్క పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద భావజాలం, మొత్తం అమెరికన్ సామ్రాజ్యవాదమంటే ప్రతి ఒక్కడూ మాట్లాడతాడు. మరి హిందూ సామ్రాజ్యవాదం అంటే పరిమితుల్లో మాట్లాడతాడు. కాదు. అమెరికన్ సామ్రాజ్యవాదం, హిందూ సామ్రాజ్యవాదం, కుల సామ్రాజ్యవాదం. కుల వర్గాన్ని రద్దు చేయడం కోసం జైలుకెళతాం. అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడతాం. హిందూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతాం. కుల సామ్రాజ్యానికి కూడా వ్యతిరేకంగా పోరాడతాం. జాగ్రత్త, ఖబడ్దార్. మిమ్మల్ని ఎక్సరే తీసే ఎక్సరే ఒకటి వచ్చింది. అవే సీవీ బుక్స్. వర్ధిల్లాలి సాంస్కృతిక విప్లవం. ∞

# శ్రమ గౌరవం అనేదాన్ని కుల వ్యవస్థ నాశనం చేసింది




◆ బి.వి. రాఘవులు

సీవి గారి సమగ్ర రచనలు సమాలోచన కార్యక్రమంలో వర్గం, కులం గురించి మాట్లాడబోయే ముందు రెండంశాలను ప్రస్తావించడం సందర్భోచితంగా ఉంటుంది. మొదటిది మనం సాంస్కృతిక విప్లవం చేద్దామనుకుంటున్నాం. కాని దేశంలో ఇప్పుడు ప్రతీఘాత సాంస్కృతిక విప్లవం నడుస్తోంది. భావ ప్రకటనా స్వేచ్ఛకి అవకాశం కలగడం లేదు. తను చెప్పదలచుకున్నది, రాయదలచుకున్నది స్వేచ్ఛగా చెప్పలేని, రాయలేని పరిస్థితులు వస్తున్నాయి. అటువంటి వాటిని ప్రతిఘటించి, ఆ స్వేచ్ఛను రక్షించుకోకపోతే మనం సాంస్కృతిక విప్లవం కోసం సాగిపోవడం సాధ్యం కాదు. ఉదయం కంచె అయిలయ్య గారు ప్రసంగించారు. ఆయన ఆంధ్రజ్యోతిలో ఒక వ్యాసం రాశారు. వ్యాసం రాసినందుకు ఆయన్ని, వ్యాసం ప్రచురించినందుకు మేనేజ్‌మెంట్‌ని, కేసువేసి కోర్టుకీడ్చారు. అత్యున్నత న్యాయశాస్త్రంలో ఒక సూత్రం ఉంది. నిన్ను చంపుతాను అన్నా నేరం కాదు, నిన్ను చంపినప్పుడే నేరం. నేను స్వేచ్ఛగా నా అభిప్రాయాన్ని రాస్తాను. కవిత్వ రూపంలో రాస్తాను, వ్యాస రూపంలో రాస్తాను. మాటల్లో చెబుతాను. అవెంత కఠినంగా అయినా ఉండొచ్చు. పరుషంగా ఉండొచ్చు. చాలా తీవ్రమైన విమర్శలుండొచ్చు. దానికి మీరు తీవ్రంగా కూడా ప్రతిస్పందించవచ్చు. అంగీకరించటం, విభేదించటం, తిరస్కరించటం చేయవచ్చు. అన్ని హక్కులు ప్రతివారికీ ఉంటాయి. అటువంటి వాటిని నిషేధించాలని ప్రయత్నించ డాన్ని ఎవరూ సహించకూడదు. కంచె ఐలయ్య అభిప్రాయాలతోటి చాలామంది విబేధించవచ్చు. నేను కూడా ఎన్నో విషయాల్లో అంగీకరించను. ఆయన అభిప్రాయాన్ని చెప్పుకుని, రాసుకునే హక్కు ఆయనకి ఉండాలి. ఆయనకు ఆ హక్కు లేకుండా చేసినపుడు ఎప్పుడో మనకూ ఆ హక్కు లేకుండా పోతుంది. అందుకని మనకు ఆ హక్కులు ఉండాలంటే అందరికీ ఉండాలని చెప్పే స్ఫూర్తితో మనం ఉండాలి. మద్రాసు ఐఐటిలో విద్యార్థులు అంబేద్కర్ పెరియార్ పేరుతో స్టడీ సర్కిల్ నడుపుకుంటున్నారు. ఈ అంబేద్కర్ పెరియార్ స్టడీ సర్కిల్ వాళ్లు స్టడీ సర్కిల్స్ నిర్వహించే పద్ధతి, నిర్వహించే అంశాలు, హిందూమతానికి, మోడీకి, సంఘ పరివార్‌కు వ్యతిరేకంగా ఉన్నాయి. దేశంలో మనుషుల మధ్య కలహాలు సృష్టించే రీతిలో, విభజించే పద్ధతిలో ఉన్నాయి. కాబట్టి ఆ స్టడీ సర్కిల్‌ను నిషేధిస్తున్నామని మంత్రిత్వ శాఖ వాళ్ళు ఒక ఉత్తరం రాసి యాజమాన్యంమీద ఒత్తిడి చేసి దాన్ని నిషేధించారు. తీవ్రమైన వ్యతిరేకత వచ్చేసరికి ఉపసంహరించుకున్నారు. అది వేరే సంగతి. కాని స్టడీ సర్కిల్ పెట్టుకుని, మాట్లాడుకుని, విమర్శ చేసుకుంటే దాన్ని కూడా సహించలేని పరిస్థితి దేశంలో ఉందంటే ఈ రోజు మనం చూస్తున్నది ప్రతీఘాత సాంస్కృతిక విప్లవం తప్ప, సాంస్కృతిక విప్లవం కాదు ఈ మధ్యన ఒక అమ్మాయి విమానమెక్కింది. పోలీసులు వచ్చి ఆమెను దించేశారు. ఆమె చేసిన నేరం ఏమిటి? భారతదేశంలో ఒక ఇరిగేషన్ ప్రాజెక్టు వలన ప్రజలు నష్టపోతున్నారు అని చెబుతూ ఆమె

చాలా కాలంగా ఆందోళన చేస్తోంది. అంతర్జాతీయంగా ఒక సెమినార్ జరుగుతుంటే ఈ ఆందోళన మీద ఒక నివేదికను అందచేయడానికి ఆమె బయలుదేరింది. ఈ ప్రభుత్వమే పాస్ట్‌పోర్టు, వీసా ఇచ్చింది. టికెట్ కొనుక్కున్న తర్వాత నువ్వు భారతదేశానికి హానికరంగా ఉపన్యాసాలు చేయబోతున్నావు అని చెప్పి అరెస్ట్ చేశారు. దొంగ, దోపిడీదారయిన లలిత్ మోడీ తప్పించుకుని విదేశాలకు పారిపోవటానికి పాస్‌పోర్టు, ఇతర సర్టిఫికెట్లు ఇచ్చిన ఈ బాపతు ఒక అమ్మాయి అభిప్రాయం చెప్పబోతే నిరోధించారు. ఇటువంటి పరిస్థితి ఈరోజు ఉన్నది. అటువంటి దాన్ని మనం తిరస్కరించాలి, వ్యతిరేకించాలి, అక్కడ్నుంచి మన సాంస్కృతిక విప్లవం ప్రారంభం కావాలని నేను మొట్టమొదటిగా చెపుతున్నాను. ప్రతి ప్రజాస్వామికవాది, ప్రతి అభ్యుదయవాది, సంస్కృతిని గురించి ఆలోచించే ప్రతివారూ దీనిని వ్యతిరేకించాలి. అందుకనే అంబేద్కర్ పెరియార్ స్టడిసర్కిల్ వాళ్ళు కేంద్ర ప్రభుత్వానికి ఒక ఉత్తరం రాశారు. "నేను మీ అభిప్రాయాలతోటి తీవ్రంగా విభేదిస్తాను. అయినా మీ అభిప్రాయాలని ఎవరైనా నిరోధిస్తే వారితో తీవ్రంగా కొట్లాడతాను" అన్న వైట్‌టాగ్ కొటేషన్‌ను ఆ ఉత్తరంలో చివర ఇచ్చారు. అటువంటి స్ఫూర్తితో మనం పోరాడాలి. వేదిక మీద మాట్లాడేవాళ్ళు అనేక దృక్పథాల నుండి ఇక్కడ మాట్లాడుతున్నారు. అనేక భిన్నాభిప్రాయాలు కూడా వ్యక్తం చేస్తున్నారు. పరస్పర భిన్నాభిప్రాయాలు కూడా ఉన్నాయి. అయినా ఆ అభిప్రాయాలను గౌరవించాలి, ఆహ్వానించాలి, నచ్చకపోతే తిరస్కరించాలి, విమర్శించాలి తప్ప వాటిని నిషేధించే హక్కు ఎవరికీ లేదు అనే స్ఫూర్తితో మనం ముందుకు పోవాలి.

శ్రమగౌరవం అనేదాన్ని ఈ కుల వ్యవస్థ నాశనం చేసింది. శ్రమ గౌరవం అనేది స్థాపించబడకుండా ఏ దేశం ముందుకు పోదు అని కంచ ఐలయ్య గట్టిగా, సోదాహరణంగా చెప్పారు. ఆయన రచనలన్ని చదివితే అది మనకు బాగా కనపడుతుంది. శ్రీరాముడికి, కృష్ణుడికి గడ్డం గీసిన మంగలి జ్ఞాపకం లేనివాడు దేవుని పూజ చేస్తే ఉపయోగమేమిటని అన్నారు. గెడ్డాలుంటే ఆ దేవుళ్ళందరూ చాలా అసహ్యంగా ఉంటారు. కానీ వాళ్ళను సుందరంగా తీర్చిదిద్ది మనం రోజూ దండాలు పెట్టే దేవుళ్ళను తయారు చేసిన ఆ మంగళ్ళను జ్ఞాపకం పెట్టుకోవడం లేదని చెప్పారు. కాబట్టి శ్రమను గౌరవించటం ఏ దేశంలో అయితే ఉండదో ఆ దేశం ముందుకు పోయే సమస్య లేదు. మరో సందర్భంలో చెబుతూ రాబోయే కాలంలో భారతదేశం పురోగమనం చెందబోతోంది. ప్రపంచంలోనే, ఆ మాట ఆయన వాడకపోయినా ఒక సూపర్ పవర్‌లాగా ఆర్థికంగా ముందుకు పోతున్నాం. ఈ వర్ణ వ్యవస్థ, దానికి ప్రాతినిధ్యం వహించే శక్తులన్నీ త్వరలోనే నాశనం కాబోతున్నాయని చెప్పారు. శ్రమను గౌరవించే వ్యవస్థ ఈ దేశంలో స్థాపించబడకుండా, శ్రమను అగౌరవపరచటానికి పునాదియైన కుల వ్యవస్థను నాశనం చేయకుండా ఈ దేశం ముందుకు పోయే సమస్య లేదని నేను చెప్పదలచుకున్నాను. అప్పటి వరకు ఏ దేశంతోనూ పోటి పడగలిగే అవకాశం లేదు. కులవ్యవస్థను త్వరగా నాశనం చేయగలిగితే త్వరగానే ముందుకు పోతాం.

ఈ సంస్కృతిని, ఈ మానసిక స్థితిని, ఈ నాగరికతను ఇలా అట్టిపెట్టుకుని దేశం ముందుకు పోతుందని అనలేము. ప్రపంచాన్ని దోపిడీ చేసేది దుర్మార్గమైన సామ్రాజ్యవాదమని చెబుతున్నాము. అమెరికా చరిత్రను పరిశీలన చేస్తే అది చెట్లు గొట్టి, నాగలితో దున్ని, అనేక ప్రతీపశక్తులని ఎదుర్కొని, ఆ శ్రమ ఆ నాగరికతలో నిబిడీకృతమైన దేశం అది. అందుకనే అది ముందుకు పోయింది. చైనాలో కుల వ్యవస్థ లేదు. చైనాలో శ్రమంటే చాలా గౌరవం. శ్రమజేసే వాడంటే గౌరవం. అమెరికాలో కూడా శ్రమజేసే వాడంటే గౌరవం. అటువంటి సంస్కృతి ఉంది కాబట్టే వాళ్ళు శ్రమ నుంచి సంపదను సృష్టించుకోగలుగుతున్నారు. ఇక్కడ కుల వ్యవస్థలో శ్రమకు గౌరవం లేదు. చదువుకు గౌరవం లేదు. శూద్రుడు చదువుకోకూడదు. స్త్రీ చదువుకోకూడదు. చదువుకుంటే చెవిలో సీసం పొయ్యాలి, లేదా నాలుక కత్తిరించాలనే నాగరికత పోకుండా చదువెలా వస్తుంది?

చదువు లేకుండా, విజ్ఞానం లేకుండా ఈ సమాజం ముందుకు పోదు. ఇప్పటికీ ఆ నాగరికత మన దేశానికి వచ్చిందని చెప్పలేము. ఇప్పటికీ ఆడపిల్లల్ని చదివించరు. ఎంపిక చేసుకోవాల్సి వస్తే అవకాశం ఆడబిడ్డ కివ్వకుండా మగపిల్లవాడికిస్తారు. 50 శాతం ఉండే స్త్రీలు ఉత్పాదక రంగంలో పాల్గొనకుండా ఏ దేశమూ ముందుకు పోదు. ఆడవాళ్ళు, దళితులు, ఇతర శూద్రులను ముందుకు తీసుకెళ్ళకుండా అది పూర్తి జనాభా లెక్క కాదు. ౦.

సివి గారి రచనలలో ప్రాచీన వ్యవస్థలో, అలాగే మధ్య యుగాల్లో, ఆధునిక కాలంలో ఈ వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ ఎలా పరిణామం చెందిందనే విషయాలు రాశారు. విస్తృతస్థాయిలో గ్రంథాలు చదవలేనివారు, ఇంగ్లీషు రాని వాళ్ళు కూడా ఆ మొత్తం సమాచారాన్ని క్రోడీకరించుకుని తెలుసుకోదలచుకుంటే ఈ పుస్తకాలు సరిపోతాయి.

అటువంటి గొప్ప సహాయం సివిగారు చేశారు. రెండోది మొత్తం కుల వ్యవస్థలోగానీ, వర్ణ వ్యవస్థలో గానీ, అలాగే కుల వ్యవస్థనీ, వర్ణ వ్యవస్థనీ స్థాపించడానికి, పెంచి పోషించడానికి, బలపరచడానికి, రక్షించడానికి అనాది నుండి ధర్మశాస్త్రాలు, పురాణ గ్రంథాలు చేసిన కృషి, ఆ కృషిలోని వైరుధ్యాలను ఈ పుస్తకాలు మన కళ్ళకు కట్టినట్లుగా ఎత్తిచూపాయి. వైరుధ్యాలను ఎత్తిచూపడమే కాదు. వీటిలో లోపాలు, చిత్రవిచిత్రాలు ఎలా ఉన్నాయి, హేతువిరుద్ధంగా ఎలా ఉన్నాయో వాటన్నింటిని తర్కబద్ధంగా చీల్చి చెండాడి, మనముందు బట్టబయలు చేసిన వివరాలు కూడా వీటిలో ఉన్నాయి. అంతేకాదు, కులవ్యవస్థ, వర్ణ వ్యవస్థల మీద ఇప్పటి వరకు జరిగిన పరిశోధనా గ్రంథాలు, ఆ గ్రంథాల్లో సారాంశం, ప్రముఖమైన వ్యక్తులు, వారు చెప్పిన అభిప్రాయాలను కూడా క్రోడీకరించి చెప్పారు.



కులం, వర్గం సమస్య కొచ్చినపుడు ఈ రెండింటి పట్ల ఆయన ఆగ్రహం, ఆవేదన, వీటిని మార్చాలనే ఆయన తపన మనకు కనపడుతుంది. ఈ పుస్తకాలు 1974-84 మధ్య కాలంలో రాశారని చెప్పారు. వివరాలు తెలుసుకుంటే 1980, 81, 82 ఈ మూడు సంవత్సరాల్లో ఈ పుస్తకాలు రాశారన్నారు. వాస్తవంగా కులం, వర్గం అంశాలు అంత తీవ్ర చర్చనీయాంశం కాని కాలంలో ఈ పుస్తకాలు వచ్చాయి. కుల వ్యవస్థ, వర్ణ వ్యవస్థ తీవ్ర తరం కాబోతున్నవని, వాటిని ఎదిరించకుండా, మార్పు చేయకుండా, నిర్మూలించకుండా, సాంస్కృతిక విప్లవం సాధ్యం కాదనే దృక్పథం ఆనాటికే ఆయనకు స్పష్టంగా ఏర్పడే ఆయన ఈ పుస్తకాలు రాశారని ఇందాక ఎవరో చెప్పారు. అదీ గొప్ప విషయం. ఆ విషయంలో మనందరికి ఆయన ఆదర్శం. మార్గదర్శి. వాటిని మనం ముందుకు తీసుకెళ్ళాల్సిన అవసరం ఉంది. అలాగే వర్గం, కులానికి సంబంధించి ఈరోజు కొంత చర్చ నడుస్తున్నది. దీంట్లో చాలా వివాదాలు, వాద ప్రతివాదాలు జరుగుతున్నాయి. కత్తి పద్మారావుగారి ప్రసంగంలో కొన్ని వాదనలు కత్తిలో పద్మంలాగా వచ్చాయి. ఆయన కత్తిలా మాట్లాడాలంటే ఇంకో రకంగా మాట్లాడేవాడు. అంశాన్ని దృష్టిలో పెట్టుకుని పద్మంలాగా కూడా మాట్లాడాడు. కులం, వర్గం ఒకటేనా? కులం వర్గంలో ఉందా, వర్గం కులంలో ఉందా? కులం పోకుండా వర్గం పోతుందా, వర్గం పోకుండా కులం పోతుందా ? ఇట్లాంటి చర్చలు చాలా ఉన్నాయి. ఇప్పుడు కమ్యూనిస్టులకు, అంబేద్కరిస్టులకూ ఉండే వ్యత్యాసాన్ని పద్మారావుగారు సింపుల్‌గా చెప్పారు. కులం, కుల వివక్ష, కుల నిర్మూలన జరగకుండా విప్లవం రాదు. కాబట్టి దానికి ప్రాధాన్యత ఇవ్వాలి అని అంబేద్కరిస్టులు అంటారు. భూమి, ఆర్థిక పరిస్థితి మారితే ఒరే, ఒసే అనే పద్ధతి దాంతోనే పోతుందని కమ్యూనిస్టులంటారని చెప్పారు. స్థూలంగా ఇప్పుడున్న చర్చ అది. కానీ నా దృష్టిలో వ్యత్యాసం అది మాత్రమే కాదు. ఆయన సువార్తమ్మ గురించి చెప్పాడు. ఒరే, ఒసే అంటే కొడవలితో నరికిపారెయ్యాలన్నాడు. అంబేద్కరిస్టులకి, మార్క్సిస్టులకి వ్యత్యాసం ఏమిటంటే, ఒరే ఒసే అంటే ఆ సువార్తమ్మలాగా నరకమని కమ్యూనిస్టులు చెపుతారు. మనం వాదిద్దామని అంబేద్కరిస్టులు చెపుతారు. అంతే తేడా. అందువల్ల వాద ప్రతివాదాలు ఎన్ని ఉన్నా ఆచరణకు ప్రాధాన్యత ఉంది. పోరాటానికి ప్రాధాన్యత ఉంది.

ఈరోజు కులవివక్ష, కుల నిర్మూలన కోసం కూడా పోరాటం చెయ్యాలి. కమ్యూనిస్టులు ఆర్థిక పోరాటం ముందు, కుల పోరాటం వెనుక అనిఎప్పుడూ చెప్పలేదు. వాస్తవంగా నేను కుల పోరాటంలో కమ్యూనిస్టుగా వచ్చాను తప్ప ఆర్థిక పోరాటాలు చేసి కమ్యూనిస్టును కాలేదని గర్వంగా చెప్పుకోగలను. నేనే కాదు, ఈ ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుల చరిత్రలు చదవండి. సుందరయ్య గారి చరిత్రగానీ, నంబూద్రిపాద్ చరిత్రగానీ చదవండి. పద్మారావు గారు చెప్పినట్లు ప్రకాశం జిల్లాలో ఏ గ్రామమయినా తీసుకోండి. ముందు చెరువుల దగ్గర ఉద్యమం ప్రారంభమయింది. హిందూ దేవాలయాల వద్ద ప్రారంభమైంది. తరువాత భూమి దగ్గరకు వచ్చింది తప్ప, భూమి దగ్గర ప్రారంభమై చెరువుల దగ్గరకు పోలేదు. అయితే వారన్న విమర్శ ఒకరకంగా సరైనది కావొచ్చు. ఒకానొక

దశలో ఆ పోరాటంలో వెనుకబడి ఉండొచ్చు. దానికి కమ్యూనిస్టుల లోపాలే కారణమని కూడా అనుకోలేము. 1952, 65లో నిర్బంధాలొచ్చాయి. 1955లో నీరసం వచ్చింది. 1964, 67లో చీలికలొచ్చాయి. ఇలా జరగటానికి రకరకాల కారణాలు, లోపాలు ఉండొచ్చు. చెయ్యాల్సింది చేయలేకపోయి ఉండొచ్చు. వైఫల్యాలు చాలా ఉన్నా ఏది ముందు, ఏది వెనుక అనే తర్జనభర్జనలతో కమ్యూనిస్టులు విఫలమయ్యారన్నది సరికాదు.

ఇప్పటివరకు కులాన్ని ప్రశ్నించకుండా కమ్యూనిస్టైన వాడు కనపడలేదు. కులాన్ని ప్రశ్నించిన తరువాతే కమ్యూనిస్టులైన వాళ్ళు కనపడుతున్నారు. 1931లో భగత్ సింగ్ ఉరితీయబడ్డాడు. అంతకు ముందు జైల్లో ఉన్నాడు. కుల వ్యవస్థను నాశనం చేయకుండా భారతదేశంలో సోషలిజం రాదు అని భగత్‌సింగ్ ప్రత్యేకంగా వ్యాసం రాశాడు. నాస్తికత్వం, సోషలిజం గురించి భగత్‌సింగ్ రాశాడని మనం పుస్తకాల్లో చదువుతాం. కాని కుల వ్యవస్థ గురించి కూడా భగత్‌సింగ్ రాశాడు. కుల సమస్య గురించి 1933, 1948 కమ్యూనిస్టు పార్టీ డాక్యుమెంట్లలోనూ రాశారు. అందుకని కమ్యూనిస్టుల అవగాహనలో కులానికి, కుల సమస్యకు ప్రాధాన్యత లేదని చెప్పుకోవాల్సిన అవసరం లేదు. రెండో విషయం అంబేద్కర్ విషయంలో కూడా భిన్నాభిప్రాయాలు ఉండొచ్చు. అంబేద్కర్ గురించిన అధ్యయనం విషయంలో కార్యకర్తల లోపం కూడా ఉండొచ్చు. ఈ పుస్తకాల్లో కులం గురించి సివి లోతుగా రాయగలిగాడు. మనుధర్మ శాస్త్రం, అర్థశాస్త్రం, వేదాలు, సంస్కృతంలో చదివారా? తెలుగులో చదివారా? అన్నది వేరే విషయం. ఇంత చదివి వాటన్నిటిని రంగరించాడు కాబట్టే రాయగలిగాడు. చదవకుండా అయితే రాయలేరు. బ్రాహ్మణ వాదం గురించి, పెట్టుబడి గురించి, పెట్టుబడి గ్రంథం గురించి ఆయన లోతుగా అధ్యయనం చేసి రాసుంటాడు.

అంబేద్కర్ రచనలను చదవకుండా ఆయన మహోన్నత వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోలేం. ఆయన కృషిలోని గొప్పదనాన్ని, పనిలో ఉండే లోపాలను అర్థం చేసుకోలేం. మార్క్సునయినా అంతే. అందుకని ఈ సమాజంలో ఎవరూ విమర్శకతీతులు కారు. మార్క్స్, అంబేద్కర్ లాంటివారు కూడా అతీతులు కాదు. వారిలో ఉండే గొప్ప విషయాలను స్వీకరించాలి. వారు చెప్పినవాటిలో ఈనాటి పరిస్థితులకు అన్వయించని వాటిని తిరస్కరించాలి. అలాగే సివి రచనలు కూడా. వాస్తవంగా ఆయన పుస్తకాలు రాసిన నాటికి, ఈనాటికీ కులం, వర్గంకు సంబంధించిన అంతః సంబంధాలలో చాలా మార్పులొచ్చాయి. 1981, 82, 83లో ఎన్నికలలో డబ్బు ప్రమేయం అంతగా లేదు. కానీ ఇందాక దివి కుమార్ చెప్పినట్లు ఆయన ప్రజాస్వామ్యం గురించి రాసిందాంట్లో డబ్బు ప్రాధాన్యత చాలా ఎక్కువ ఉందని చెప్పటం అంటే ఆయన దాన్ని గమనించి రాశాడు. 1955లో కమ్యూనిస్టులు మంచి ఓట్లు తెచ్చుకొని, సీట్లు లేకుండా ఓడిపోయారు. కాంగ్రెస్‌వాళ్ళు ఉప్మాలు పెట్టించారు, కాఫీలు పోయించారు, టీలు తాగించారు. ఈ రకంగా ఓటర్లను ప్రలోభ పెట్టారు. అందుకని ఓడిపోయాం అని అప్పుడు కమ్యూనిస్టు పార్టీలో చర్చ జరిగినట్లు డాక్యుమెంట్లలో ఉంది. డబ్బు యొక్క ప్రమేయం ఆరోజుల్లో అలా ఉంది. 1991లో సరళీకరణ విధానాలు ప్రారంభమైన తర్వాత డబ్బుపాత్రను గమనిస్తే అప్పటికీ, ఇప్పటికీ పోలిక లేదు. దానికన్నా మించి సివి పుస్తకాల్లో ఒక విషయం క్లుప్తంగా రాశాడు. అదేమిటంటే, పెట్టుబడిదారీ వ్యవస్థలో, పార్లమెంటరీ విధానం ఏ విధంగా చిలవలు పలవలుగా వికృత రూపం ధరిస్తుందో స్పష్టం చేశాడు. తర్వాత ఎన్నికల్లో కులం యొక్క పాత్ర చాలా పెరిగింది. 1980 దశకం తర్వాతనే ఇది తీవ్రమైంది. అంతకుముందు కూడా కులాన్ని ఉపయోగించుకున్నారు. కానీ కులం పేరుతోటే పార్టీలు, ప్రతి కులానికి ఒక పార్టీ రావడం, అంతకుముందున్న పార్టీలను ఒక్కొక్కరూ ఆక్రమించుకోవడం జరిగింది. అంతకు ముందు గొడుగులుండేవి. ఇప్పుడు అలాంటివేం లేవు. జండా కర్రలే ఉన్నాయి. అప్పుడు గొడుగుల కింద ఉండేవాళ్ళు, ఇప్పుడు జెండాల కిందుంటున్నారు. ప్రతి కులానికి ఒక జెండా అనే పరిస్థితి వచ్చింది. అంటే పెట్టుబడిదారీ వ్యవస్థలో పార్లమెంటరీ విధానం పాత కుల వ్యవస్థను ఆధునికంగా ఉపయోగించుకునే ఒక కొత్త పద్ధతి వచ్చింది.

ఈ పుస్తకాల్లో కులం గురించి సివి లోతుగా రాయగలిగాడు. మనుధర్మ శాస్త్రం, అర్థశాస్త్రం, వేదాలు, సంస్కృతంలో చదివారా? తెలుగులో చదివారా? అన్నది వేరే విషయం. ఇంత చదివి వాటన్నిటిని రంగరించాడు కాబట్టే రాయగలిగాడు. చదవకుండా అయితే రాయలేరు.

దాన్ని గురించి సివిగారు రాశారు. అంటే ఇన్ని మార్పులొచ్చాయి. ఈ మార్పులను దృష్టిలో పెట్టుకొని పరిశోధకులు వీటన్నిటిని ఇంకా ముందుకు తీసుకెళ్ళాల్సిన అవసరముంది. ఓపికుంటే సివి గారు అది చేసుండేవారు. ఎవరైనా అటువంటి ప్రయత్నాలు చేస్తే దాని కొనసాగింపుగా తెలుగులో పుస్తకాలు రావాల్సిన అవసరం ఉంది.

. మొదటిదేమంటే ఈ కులం, వర్గం రెండు పదాలను జమిలిగా వాడటమే మొదటి పొరపాటు. ఎందుకంటే వర్గం అనేది ఇంగ్లీషులో చెప్పాలంటే అబ్‌స్ట్రాక్ట్ కాన్సెప్ట్ (అనిర్దిష్టమైన భావన). అది నిర్దిష్టంగా ఎక్కడా మనకు కనపడేది కాదు. కులమనేది ఒక వ్యవస్థకు సంబంధించి నిర్దిష్టమైన రూపం. వర్గం అనేది పెట్టుబడిదారీ విధానంలో ఉంటుంది, ఫ్యూడలిజంలో ఉంటుంది, బానిస వ్యవస్థలో ఉంటుంది. అన్నిచోట్లా ఉంటుంది. అన్నిట్లో ఉంటుంది. చెట్టు అన్నామంటే చెట్టు ఎక్కడుందో చెప్పండి. చెప్పలేరు. మామిడిచెట్టంటే చెప్పగలరు, జామచెట్టంటే చెప్పగలరు. నిమ్మచెట్టంటే చెప్పగలరు. చెట్టనేది ఒక సార్వజనీన అనిర్దిష్ట భావన. వర్గం కూడా అంతే. అందుకని దీన్ని అర్థం చేసుకొంటే వర్గం, కులం పోల్చటానికి పనికిరావని చెప్పొచ్చు. ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థలో వర్గాల గురించి మనం చెప్పుకోవచ్చు. పెట్టుబడిదారులు, కార్మికులు, మధ్యతరగతి, ధనిక రైతులు, భూస్వాములు, వ్యవసాయ కార్మికులు ఈ రకంగా వర్గాల్ని చెప్పుకోవచ్చు. పెట్టుబడిదారీ పూర్వ వ్యవస్థలో కుల వర్గాలున్నాయి. కాని ఆ వర్గాలకు వేరువేరు పేర్లున్నాయి. ఐరోపాలో చూస్తే అక్కడ బారన్స్, నైట్స్, లార్డ్స్ వర్గాలు ఉన్నాయి. వాళ్ళు మూడే చెప్పారు. అందర్నీ పాలించేవాళ్ళు, అందర్నీ రక్షించేవాళ్ళు ఒక వర్గం, అందరికీ పూజలు చేసే వాళ్ళు, అందరికోసం ప్రార్థనలు చేసేవాళ్ళొకవర్గం. అందరికోసం పనిచేసే వాళ్ళొకవర్గం. మన పరిభాషలోకి దాన్ని అనువదిస్తే అందరికోసం పూజలు చేసేవాళ్ళు బ్రాహ్మణులు, అందరినీ రక్షించేవాళ్ళు రాజులు, అందరికీ పనిచేసేవాళ్ళు శూద్రులు. కాని అక్కడ వాళ్ళు ఎస్టేట్స్ అన్నారు. ఇక్కడ మనం కుల వ్యవస్థ అన్నాం. అందుకని పెట్టుబడిదారీ పూర్వ ఆర్థిక వ్యవస్థ యొక్క సామాజిక వ్యవస్థ వర్గ రూపమే కుల వ్యవస్థ, వర్ణ వ్యవస్థ. అది పెట్టుబడిదారీ విధానానికి సంబంధం లేనిది. ఈ రకమైన అభిప్రాయానికి వస్తే పెట్టుబడిదారీ పూర్వ వ్యవస్థలో వర్గాల గురించి ఆలోచించేట్పుడు కుల వ్యవస్థ, ఆధునిక పెట్టుబడి దారీ వ్యవస్థలో వర్గ వ్యవస్థ గురించి ఆలోచించేటప్పుడు కార్మికులు వస్తారు. కాబట్టి ఈ రెండు పదాల పట్ల సరైన అవగాహనతో ఉంటే కొన్ని గందరగోళాలు ఉండవు.

రెండవది. ఇప్పుడు కులం గురించి ఎందుకు మాట్లాడుకుంటున్నాం. ఎందుకు మాట్లాడుకుంటున్నామంటే భారతీయ సమాజం అమెరికాలాగా స్వచ్ఛమైన పెట్టుబడిదారీ సమాజంగా అభివృద్ధి కాలేదు. ఈరోజు అమెరికాలో నూటికి 98 మంది పారిశ్రామిక రంగంలో ఉన్నారు. నూటికి ఇద్దరు మాత్రమే వ్యవసాయ రంగంలో ఉన్నారు. నూటికిద్దరున్న వ్యవసాయరంగం కూడా పరిశ్రమలాగే ఉంది తప్ప మన గ్రామీణ ఆర్థికవ్యవస్థలాగా లేదు. వ్యవసాయం కూడా పరిశ్రమైపోయింది. ఆ వ్యవసాయ రంగంలో పనిచేసేవారు కూడా పెట్టుబడిదార్లు, కార్మికుల్లా ఉన్నారే తప్ప మనలాగా రైతు, వ్యవసాయ కార్మికుడు, కౌలుదారు రూపంలో లేరు.

స్వచ్ఛమైన పెట్టుబడిదారీ విధానంలో వర్గాల గురించి మాట్లాడుకున్నప్పుడు ఈ కులం అనే ప్రశ్న రాదు. కార్మికులు, పెట్టుబడిదారులు, మధ్యతరగతి ఇలా వస్తాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రధానమైన స్థాయికి చేరుకుంటోంది. ఎందుకంటే ఇప్పటికీ నూటికి 60 శాతం గ్రామాల్లోనే ఉన్నారు. గ్రామాలలో కులవ్యవస్థ ఇంకా విచ్ఛిన్నం అయిపోలేదు. విచ్ఛిన్నం అయిపోవడం కాదు, ఈరోజూ వృత్తికో కులం ఉన్నాయి. అవి విచ్ఛిన్నం కాకుండా స్వచ్ఛమైన పెట్టుబడిదారీ వ్యవస్థ వచ్చిందని చెప్పలేం. కొన్ని కులాలు విచ్ఛిన్నం అవుతున్నాయి. కానీ ఇంకా కొన్ని కులాలు విచ్ఛిన్నం కాలేదు. ఈరోజు పౌరోహిత్యం ఎవరు చేస్తున్నారు? బ్రాహ్మణులే చేస్తున్నారు. బ్రాహ్మణుల్లో నుండి కొంతమంది ఇతర ఉద్యోగాల్లోకి పోయారు తప్ప పౌరోహిత్యంలోకి ఇప్పటివరకు ఇతర కులాల వాళ్ళు రాలేదు. ఇప్పటికీ పౌరోహిత్యం బ్రాహ్మణులే నిర్వహిస్తున్నారు. ఇప్పటికీ క్షవరం చేసే వృత్తిలోకి ఇతరులు రావడం లేదు. క్షవరం చేసేవాళ్ళు ఇంకో వృత్తిలోకి పోయి ఉండొచ్చు కాని, వేరే వృత్తి వాళ్ళు ఈ వృత్తిలోకి రాలేదు. కత్తి మంగలి చేతిలోనే ఉంది. బట్టలుతికే వృత్తి ఇంకా ఉంది. దురదృష్టం ఏమిటంటే పెట్టుబడిదారీ విధానం ఈ వృత్తుల్ని నాశనం కాకుండా చేస్తోంది. మనం కుల వ్యవస్థ మీద పోరాడాలంటే ఇది విచ్ఛిన్నం కావాలి. కానీ నిరుద్యోగులయిపోయి, బతకలేక వీధుల్లో పడుతుంటే రక్షించేదానికి వృత్తి కావాలని చెప్పి ఈ వైరుధ్యంలో పడిపోతున్నాం. కొన్ని గుర్తులు, కులానికి వృత్తికి ఉన్న లంకె పెట్టుబడిదారీ విధానంలో ఇప్పటికీ బద్దలైపోలేదు. అది కొనసాగుతూనే ఉంది. అది

కొనసాగినంత కాలం కులానికి , వర్గానికి ఉండే సంబంధం చెదిరిపోదు. కులం, వర్గం ఈ సమాజంలో కూడా ఫ్యూడల్ వ్యవస్థలో కులం రూపంలో ఇప్పటికీ కొనసాగుతుందనేది నేను చెప్పదలచుకున్నాను. కాబట్టి స్వచ్ఛమైన పెట్టుబడిదారీ విధానం రావాలంటే ఫ్యూడల్ వ్యవస్థలో ఒక వర్గం వాళ్ళు ఒకే కులంలో ఉండే పద్ధతిని బద్దలు కొట్టాలి.

పెట్టుబడిదారీ విధానంలో వర్గాలు అభివృద్ధి అయ్యాయి. కానీ ఇంగ్లండు, అమెరికా లాంటి చోట్ల పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి అయినట్లు ఎక్కడా అభివృద్ధి కావటం లేదు. ప్రతి వర్గంలోనూ అన్ని కులాల వాళ్ళు చేరుతున్నారు. పెట్టుబడిదారీ విధానంలో వర్గ రూపంలోనే కొన్ని కులాలు కొనసాగుతున్నాయి. భావజాల రూపంలో అన్ని వర్గాలలో కులం కొనసాగుతోంది. పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క అవసరంగా కూడా కులం కొనసాగుతున్నది. అందుకనే నేను మూడు పదాల్లో చెప్పదలచుకున్నాను. ఫ్యూడల్ వ్యవస్థ యొక్క అవశేషంగా కుల వ్యవస్థ కొనసాగుతున్నది. ఫ్యూడల్ వ్యవస్థ యొక్క భావజాలంగానూ కులవ్యవస్థ కొనసాగుతున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థ అవసరంగా కూడా కుల వ్యవస్థ కొనసాగుతున్నది. పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క అవసరమేమిటి? ఇప్పుడు దళితుణ్ణి పాలేరుగా పెట్టుకుంటే అతనికి వెయ్యి రూపాయలిస్తే సరిపోతుంది. బీసీని పాలేరుగా పెట్టుకుంటే 1200 రూపాయలు ఇవ్వాల్సి వస్తుంది. అగ్రకులం వ్యక్తిని పాలేరుగా పెట్టుకుంటే అతనికి 1500 రూపాయలు ఇవ్వాల్సి వస్తుంది. పెట్టుబడిదారీ విధానంలో ఈ కుల వ్యవస్థ వాసన కొనసాగితే పెట్టుబడిదారులకు అదనపు విలువ దోచుకోవడానికి ఎక్కువ అవకాశం ఉంటుంది. పెట్టుబడిదారుడెవరైనా, అతడెంత ప్రజాస్వామికవాదైనా ఈ కుల వ్యవస్థ వాసనలు పోవాలని కోరుకోవడం లేదు.



కులం, మతం గురించి మాత్రమే మాట్లాడితే సరిపోదు. మహిళల గురించి కూడా మాట్లాడాలి. మహిళలను కూడా తక్కువ వారిగా ఎందుకు చూస్తున్నారు? మహిళ పురుషుడికన్నా తక్కువ వేతనానికి పనిచేస్తుంది. అందువలన పెట్టుబడిదారీ వ్యవస్థలో మహిళలు తక్కువ వారిగా ఉండాలి. పెట్టుబడిదారీ విధానం తన దోపిడిని కొనసాగించుకోవటం కోసం ఇలాంటి కులవ్యవస్థ కొనసాగాలని కోరుకుంటున్నది. అందుకని ఈరోజు ఈ మూడు రూపాల్లో కులం కొనసాగుతూ ఉన్నది. వీటిని మనం ఎదిరించి పోరాడాల్సిన అవసరం ఉన్నది. ఇక్కడ అంబేద్కరిస్టులకు మార్క్సిస్టులకు మధ్య తేడా ఏమిటంటే పెట్టుబడిదారీ విధానాన్ని నాశనం చేయకుండానే ఫ్యూడల్ అవశేషాలను నాశనం చేయవచ్చని అంబేద్కరిస్టులు చెబుతారు. పెట్టుబడిదారి విధానాన్ని నాశనం చేయకుండా వట్టి భావజాల పోరాటంతోనే కులం పోదని మార్క్సిస్టులు చెబుతారు.

ఆనాడు అనేకమంది నాయకులు అగ్రకులాల నుండి వచ్చారు. వారు భావజాలాన్ని ఎలా పోగొట్టుకున్నారు? తమలోని ప్రతికూల భావాలపై అంతర్గత పోరాటం ద్వారా వాటిని పోగొట్టుకున్నారు. అలాగే సమాజంలో కూడా పోగొట్టవచ్చు. కానీ పెట్టుబడిదారులకు ఈ కుల వ్యవస్థ వల్ల లబ్ది ఉంటుంది. కాబట్టి ఈ వ్యవస్థను కాపాడుతున్నారు. అలాగే కులానికి, వృత్తికి ఉండే లంకె ఇంకా కొనసాగుతున్నది. ఆ లంకెను బద్దలు కొట్టకుండా ఫ్యూడల్ వ్యవస్థ అవశేషమైన కుల వ్యవస్థను ఎట్లా పోగొడతాం? అందువలన ఇది బహుముఖ పోరాటం. వారు చెప్తున్నట్లు భావజాల పోరాటానికి ప్రాధాన్యత ఇవ్వాలి. భావజాల పోరాటం లేకుండా, కార్మికులు, ఇతర కష్టజీవులు ఐక్యం కాకుండా వర్గపోరాటం ముందుకు పోయే అవకాశం లేదు. అందుకని కులవ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం చేయనివాడు కమ్యూనిస్టే కాదని నేను చెప్పదలచుకున్నాను. ఆ పోరాటం ద్వారానే వారిని ఐక్యం చేయగలం. ఐక్యం అయితేనే బలం ఉంటుంది. కాబట్టి ఐక్యం చేయడమనేది వర్గపోరాటంలో ఒక భాగం. కులభావాలను నిర్మూలించడం ద్వారా వర్గ ఐక్యతను నిర్మించడమనేది వర్గ పోరాటంలో

ఒక భాగం తప్ప దీనికి పోటీ కాదని అర్థం చేసుకుని ముందుకు పోవాలి. దాన్ని విడదీసి అది ముందా? ఇది ముందా? అదెక్కువా? ఇదెక్కువా? అని కాకుండా, ఇది జరిగితేనే వర్గ ఐక్యత బలపడుతుందని, వర్గ పోరాటంలో అంతర్భాగంగా దీన్ని ముందుకు తీసుకుపోవాలని నేను చెప్పదలచుకున్నాను.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రజాస్వామిక ఎన్నికల విధానం కూడా కుల వ్యవస్థను రక్షిస్తుంది. ఎందుకు వ్యవస్థను రక్షిస్తుంది? పెట్టుబడిదారులు అధికారంలో, సంపదలో వాటా కోసం ప్రయత్నిస్తుంటారు. ప్రతి కులంలో అభివృద్ధి అవుతున్న మధ్యతరగతి పెట్టుబడిదారీ వ్యవస్థలో తమ స్థానం కోసం, తమ వాటా కోసం, తమ లాభం కోసం కులం పేరుతో ప్రజలను వినియోగించు కుంటున్నారు. మన కులం వాడికి ముఖ్యమంత్రి పదవి లేదు, మంత్రి పదవి లేదు, ఫ్యాక్టరీ లేదు, కాబట్టి మీరందరూ రండి అని కులం పేరుతో ప్రజలను సమీకరిస్తున్నారు. మీకు భూమి లేదు, భూమికోసం అందరూ రండి అని అనటం లేదు. ఆ మాట కమ్యూనిస్టులంటున్నారు. మనకు పదవి లేదు, ఫ్యాక్టరీలు లేవు, అప్పులేవు కాబట్టి మీరందరూ రండంటూ ప్రజలను సమీకరించి, వాటిని తీసుకుంటున్నారు. కమ్యూనిస్టులు కూడా దాన్ని సమర్థిస్తున్నారు. ఎందుకని? ఒకే కులం వాళ్ళు పెట్టుబడిదారులుగా ఉండటం కన్నా అన్ని కులాల వాళ్ళు పెట్టుబడిదారుల్లో ఉంటే అన్ని కులాల పేదలను ఐక్యం చేయడం సులభమవుతుంది. ఎందుకంటే అక్కడ దళితుడుంటాడు, కమ్మ ఉంటాడు, రెడ్డి ఉంటాడు, బ్రాహ్మణుడుంటాడు. అందరూ కలిసి మనల్ని దోచుకుంటున్నారు. అందరూ కలిసి దోచుకుంటున్నప్పుడు, అందరం కలిసి పోరాడాలి అని చెప్పడం మనకు సులభం అవుతుంది. పెట్టుబడిదారులకు బ్యాంకులు రుణాలిస్తున్నాయి. దళిత పెట్టుబడిదారులకు కూడా బ్యాంకు రుణాలు కావాలనే డిమాండ్‌ను బలపరుస్తాం. ఆ వాటా తీసుకుని దళితుల్లో కొందరు పెట్టుబడిదారులైపోతే మనకు సోషలిజం రాదు. కానీ దళితులు కూడా పెట్టుబడిదారుల్లో చేరడం మనకు అవసరం. ప్రజాతంత్ర ఉద్యమం ముందుకు పోవడానికి తోడ్పడుతుందని ఆ డిమాండ్‌కు మనం మద్దతిస్తున్నాము. పెట్టుబడిదారీ విధానంలో ఈ కులాల్లో అభివృద్ధి చెందుతున్న మధ్యతరగతి ఈరోజు ఈ వ్యవస్థను రక్షించేదానికి పేద ప్రజలను కులం పేరుతో ఉపయోగించుకొంటున్నారు.

వివిధ కులాల్లో అభివృద్ధి అయిన మధ్యతరగతి ఒకప్పుడు అభ్యుదయమైన పాత్ర నిర్వహించింది. డా॥ బాబా సాహెబ్ అంబేద్కర్ మహర్ కులంలో జన్మించాడు. వాళ్ళ తండ్రి సైనికుడుగా పనిచేశాడు. దానివల్ల కొన్ని అవకాశాలొచ్చి ఆయన చదువుకోగలిగాడు. ఒక రకంగా మహర్‌లలో మధ్యతరగతిగా అభివృద్ధి అయ్యాడు. ఆ కులంలో ఉండే సమస్యలను అధ్యయనం చేయడానికి, వారిని విముక్తి చేయడానికి మార్గాలను అన్వేషించ డానికి ఆ చదువును వినియోగించాడు. సుందరయ్య, నాగిరెడ్డి, రాజేశ్వరరావు, వీళ్ళందరూ సంపన్న రైతాంగ కులాల్లో పుట్టారు. బనారస్‌కి, ఇతరచోట్లకు వెళ్ళి చదువుకొచ్చారు. తమ విద్యను, తెలివితేటల్ని చుట్టూ ఉండే రైతాంగం, గ్రామసీమల్లోని ప్రజలను కష్టాల నుంచి విముక్తి చేయడానికి వినియోగించారు. అలాగే పెరియారు ఇటువంటి వాళ్ళందరూ బ్రాహ్మణులే అధికారంలో భాగంగా ఉండటమేమిటి? మిగతా శూద్రులు, మేమూ చదువుకున్నామని చెపుతూ వీళ్ళందర్నీ సమీకరించడానికి ప్రయత్నించారు. దళితుల్లో ఉండే మొదటితరం మధ్యతరగతి, అంటే కత్తి పద్మారావు వీళ్ళ తరమేమో ఈ మధ్యతరగతికి ఉపయోగపడ్డారు. ఇప్పుడు కొత్త మధ్యతరగతి పద్మారావుగారిని పట్టించుకొనే పరిస్థితి లేదు. జగన్ దగ్గర స్థానం దొరుకుతుందా, లేకపోతే చంద్రబాబు దగ్గర స్థానం దొరుకుతుందా అనే స్థితిలో ఉన్నారు. బలహీన వర్గాల్లో అభివృద్ధి అయ్యే మధ్య తరగతి మీద ప్రస్తుతం పెద్దగా ఆశలు పెట్టుకోవద్దు. అప్పుడు అంబేద్కర్‌కే కోపం వచ్చింది. వీళ్ళందరూ రిజర్వేషన్లు ఉపయోగించుకుని సంపద పోగుచేసుకొని తమవాళ్ళను మరిచిపోతున్నారన్నాడు. ఆరోజు కొద్దిమంది చేశారు. ఇప్పుడందరూ చేస్తున్నారు. దీన్ని దృష్టిలో పెట్టుకుని కులవ్యవస్థను నిర్మూలించడం కోసం ఈ రోజు కమ్యూనిస్టులు, అభ్యుదయ వాదులూ ఏకం కావాలి. ఇతర అంశాలపై విభేదాలున్నా ఈ అంశం మీద ఏకీభావాన్ని తీసుకువచ్చి ముందుకు పోవాలి. ఈ కొత్త కొత్త అంశాలను కూడా సీవీ గారు రాయాలి. ఆయన మెదడు పదునేం తగ్గలేదు. ఎవరిచేతైనా రాయించగలిగితే చిన్న చిన్న అంశాలుగా చెప్పి రాయించడం కొనసాగించాలి. ఆయన వారసత్వాన్ని పుణికిపుచ్చుకొని మీలో చాలామంది ఈ అంశాల మీద రాబోయే కాలంలో మంచి మంచి రచనల కోసం ప్రయత్నం చేయాలి.

ది

# మానవుడు కేంద్రంగా సమాజం నిర్మించబడాలి




◆ లవణం

జై ఇన్‌సాన్. మొట్టమొదట మూడు విషయాలు చెప్పాలి. మొదటిది వీరివన్నీ రాసి 20, 30 సంవత్సరాలైపోయింది. అప్పుడు వున్న సమాజాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన రాశారు. ఈ 20, 30 సంవత్సరాల్లో సమాజం ఎంతగానో మారిపోయింది. ఆలోచనలంతగా మారిపోయాయి. ఇవి ఒక్క సీవీగారు రాసినదానికేకాదు, నేను రాసిన వాటికి కూడా చెబుతున్నాను. నాకిప్పుడు 86 ఏళ్ళు. అలాగే మార్క్స్ కూడా ఇండస్ట్రియల్ రివల్యూషన్ వస్తూ వున్న కాలంలో రాశాడు. అందువల్ల మనం ఏదైనా రాసేటప్పుడు సమకాలీన సమాజ ప్రభావం మన మీద ఎక్కువగా వుంటుంది, ఆ సమకాలీన సమాజంలో మనం ఏ మార్పులు కోరుతున్నామో, వాటిని దృష్టిలో పెట్టుకుని ఎక్కువగా మనం మార్పు గురించి రాస్తాం. అలా చూడాలని చెప్పేసి నేను కోరుతున్నాను.

సీవీగారిని ఆ మొదట్రోజుల్లో అప్పుడప్పుడూ చదువుతూ వుండేవాణ్ణి. పెద్ద పరిచయం లేదు, మూడు నాలుగు సార్లే మేము కలిశాం. నాకు ఆయనలో నచ్చినటువంటివి ప్రధానమైనటువంటివి రెండు గుణాలు. ఒకటి, ఆయన ఏదనుకుంటాడో అది కుండబద్దలు కొట్టినట్లు చెప్పేస్తాడు. ఇక రాజీలేదు చెప్పడంలో. రెండోది ఆయన మార్క్సిస్టు దృక్పథంలోంచి ప్రతీదీ చూస్తారు.

ఇప్పుడు నేనున్నాను. నేను ప్రతీదీ నాస్తిక దృక్పథంలోంచే చూస్తాను.

మానవజాతి పురోగమనం సోవియట్ యూనియన్ పతనంతోటి ఆగిపోయింది. అందుచేత గత ఈ 25 సంవత్సరాలుగా మనం తిరోగమనంలో వున్నాం. అంచేత మళ్ళీ వెనకవన్నీ మనకు అవసరమవుతున్నాయి.

అయితే ఇదివరకు తిరోగమనం సాంఘిక, ఆర్థిక రంగాల వరకే తీసుకొని వుండేది. ఇవాళ సాంఘిక, ఆర్థిక రంగాలు తీసుకొని కాదు. ఈరోజు తిరోగమనానికి యాంత్రీకరణ ప్రధాన కారణం. సమాజం మనిషి కేంద్రంగా పురోగమిస్తుంది. మనిషి కేంద్రంగా మారుతుంది. ఈరోజున మనిషి బదులు యంత్రం కేంద్రమై పోతోంది. అందుచేత ఈ యంత్రం కేంద్రమైపోయినటువంటి సమాజంలో ఇదివరకు పెట్టుబడిదారీ వ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ, ఫాసిస్టు వ్యవస్థ, ఆ వ్యవస్థ, ఈ వ్యవస్థ అని చాలా చెప్పుకోవడానికి అవకాశం వుండేది. కాని సోవియట్ యూనియన్ పతనమైపోయిన తర్వాత పెట్టుబడిదారీ విధానం అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానంగా మారిపోయింది.

కనుక ఈ మార్కెట్ వ్యవస్థకు అనుకూలంగా ఏ ప్రభుత్వమైనా వుండకపోతే ఆ ప్రభుత్వం పడిపోతుంది. అది

కేవలం రాష్ట్రాల స్థాయిలోనే కాదు, దేశాల స్థాయిలో కూడా. అంచేత ఈ 20, 30 సంవత్సరాలలో సమాజంలో వచ్చినటువంటి మార్పును ఇది ఇలాగే గనక మరో 10 సంవత్సరాలు కొనసాగించినట్లయితే మనిషి తనను తాను మర్చిపోయే స్థితి వస్తుంది. తనకో ప్రేమ వుందని, తనకో కుటుంబం వుందని, తాను పది మందితో స్నేహంగా వుండాలని మర్చిపోయే స్థితి వచ్చేస్తుంది.

ఈ పరిస్థితిలో సాంఘిక మార్పులెలా వస్తాయి. ఆర్థిక మార్పులెలా వస్తాయి. రాజకీయ మార్పులెలా వస్తాయి. అనేటటువంటి ఆలోచనలో మనం వున్నాం. దాంట్లో గతం ఏమిటీ అనే చరిత్ర మనకు తెలియాలి. లేనట్లయితే గతమే మనల్ని మార్పు రానీయకుండా అడ్డగిస్తుంది. గతం డైనమిక్ కాదు. ఎప్పుడూ వర్తమానవే డైనమిక్. ఎప్పుడూ ఫ్యూచర్ గురించి మనం చేసే ఆలోచనలే డైనమిక్. కానీ కనక గతం మనకి తెలియాలి. ఆ గతంలో ఈ కుల వ్యవస్థ, ఈ మత వ్యవస్థ , ఈ దైవ భావం ఇవన్నీ కూడా సమాజం మీద ఎటువంటి ప్రభావాలు వేసేయి. ఇవి ఎలా వచ్చేయి అని తెలుసుకోవాల్సిన అవసరం చాలా వుంది. ఆ సందర్భంలో ముఖ్యంగా కుల వ్యవస్థ మీద, వర్ణ వ్యవస్థ మీద నేను సివిగారి ఒక్క పుస్తకమే చదివాను.

*వర్తమాన నాగరికత మానవ వ్యతిరేక నాగరికత, ప్రకృతి వ్యతిరేక నాగరికత. ఈ మానవ వ్యతిరేక నాగరికతను, ప్రకృతి వ్యతిరేక నాగరికతను ఆపి, మళ్ళీ మానవ కేంద్రకమైన నాగరికత కావాలి. ప్రకృతి కేంద్రకమైనటువంటి నాగరికత కావాలి. దానికి ఎటువంటి త్యాగమైనా మేం చేస్తాం. అని గనక ఇప్పటి యువతరం అనకపోయేటట్లయితే యిదివరకు చేసినటువంటి తప్పులు వాళ్ళందరివి చిన్న తప్పులు, ఈ యువతరం చేసేటటువంటి తప్పు, ఘోరమైనటువంటి తప్పు.*

కుల రాహిత్యానికి కూడా ఈ కులాలు మార్చి వర్ణాంతర వివాహాలు చేసుకోవాలి. మతాంతర వివాహాలు చేసుకోవాలి. దేశాంతర వివాహాలు చేసుకోవాలి. ఇప్పుడు ఈ వివాహం అస్పృశ్యతా నిర్మూలన వివాహము. ఈవివాహము కుల నిర్మూలన వివాహము. ఈ వివాహము శాంతి కోసం చేసే ప్రయత్నమూ. అని గట్టిగా చెప్పగలిగేటటువంటి స్థితి మనకు రావాలి. అది రావాలి అంటే గతం యొక్క చరిత్రని మనం తెలుసుకోవాలి. అటువంటి సాంఘిక చరిత్ర తెలుసుకోవడంలో ముఖ్యంగా ఈ వర్ణ వ్యవస్థ మన దేశంలో ఎలా వచ్చింది? మనదేశంలో ఆర్యుల ద్వారా ఎలా వచ్చింది? మనదేశంలో ద్రావిడుల ద్వారా ఎలా రూపం తీసుకుంది? మన దేశంలో ఈ వర్ణ వ్యవస్థ ఆర్యులు దక్షిణానికి వచ్చినపుడు ఎలా వచ్చింది? ఆర్యులు ఉత్తరాదికి వెళ్ళినపుడు ఎలా వచ్చింది?

ఇలాంటివన్నీ ఇప్పుడున్న తరం చదివేటట్లయితే మన మనసులో వున్నటువంటి అనేక రకములైన సాంఘిక అభిప్రాయాలు గతం గురించి మారతాయి. ఎప్పుడైతే గతం గురించి మన అభిప్రాయాలు మార్చుకోడానికి సిద్ధపడతామో అప్పుడు ఆ సంస్కృతి మనలను భవిష్యత్తులో ముందుకు తీసుకెళుతుంది.

గతం గురించిన మార్పులను మనం అర్థం చేసుకున్నట్లయితే మనం వర్తమానంలో భవిష్యత్తును ఎలాగ చూడాలి, భవిష్యత్తును ఎలాగ నిర్మించాలి దానికి తోడ్పడుతుందనేది చెప్పేసి, దోహదం చేస్తుందని చెప్పేసి ఆయన చాలా చక్కగా రాశారు. చాలా స్పష్టంగా రాశారు. చాలా తీవ్రంగా రాశారు. మీ అందరు చదవాలని కోరుతూ నేను చివర ఒక్కటే ఒక మాట చెపుతున్నాను. వర్తమాన నాగరికత మానవ వ్యతిరేక నాగరికత, ప్రకృతి వ్యతిరేక నాగరికత. ఈ మానవ వ్యతిరేక నాగరికతను, ప్రకృతి వ్యతిరేక నాగరికతను ఆపి, మళ్ళీ మానవ కేంద్రకమైన నాగరికత కావాలి. ప్రకృతి కేంద్రకమైనటువంటి నాగరికత కావాలి. దానికి ఎటువంటి త్యాగమైనా మేం చేస్తాం. అని గనక ఇప్పటి యువతరం అనకపోయేటట్లయితే యిదివరకు చేసినటువంటి తప్పులు వాళ్ళందరివి చిన్న తప్పులు, ఈ యువతరం చేసేటటువంటి తప్పు, ఘోరమైనటువంటి తప్పు.

అయితే గతం గురించి తెలుసుకుంటూ వుంటే భవిష్యత్ లో మనం ఏది సాధించాలి అనేది సమగ్రంగా ఆలోచించాలి. ఒక్క సాంకేతికంగా వద్దు. ఒక్క వర్ణ వ్యవస్థ మీద ఒద్దు. అంచేత సమగ్రమైన జీవితానికి సమగ్రమైనటువంటి ఆలోచనలు కావాలి.*, మీరందరూ ఆలోచించడానికి గతాల్ని, అందులో ముఖ్యంగా సాంఘిక గతాల్ని తెలుసుకుంటే మనం సంఘ నిర్మాతలుగా వుంటాం.

# సివి రచనల ప్రాధాన్యత ఇప్పుడే ఎక్కువ ఉంది

◆ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి




కడపలో ఒక హేతువాద సంఘం ప్రారంభించాలని, జిల్లా పరిషత్ సమావేశ మందిరంలో ఒక మీటింగ్ జరిగింది. నేను దానికి వెళ్ళాను. ఎమ్మెల్సీ గేయానంద్ వచ్చారు. గోగినేని బాబు వచ్చారు. ఇంకా చాలామంది వచ్చారు. గోగినేని బాబు ప్రారంభోపన్యాసం చేయగానే ఒక నలుగురైదుగురు కుర్రాళ్ళు లేచి మీరు హిందువుల మనోభావాలు గాయపరుస్తున్నారు. మేం దీన్ని నిరసిస్తున్నాం. మీరు హిందూ మతాన్ని మాత్రం విమర్శిస్తున్నారు. ముస్లిం, క్రైస్తవ మతాలను ఏం పట్టించుకోవడం లేదు. మీకంతా విదేశీ డబ్బు వస్తావుందని చెప్పేసి నానా యాగీ చేశారు. మేము చాలా ఓపికగా అయ్యా మీరు కూర్చోండి. మేము మాట్లాడేదంతా వినండి. మీకు పేపర్లిస్తాం. దాంట్లో మీకున్న సందేహాలు, ప్రశ్నలు రాసి పంపండి అంటే మీరడిగితే మేం ప్రశ్నలేసేదేంటి అని ఊరక గోల చేస్తే బైటెయ్యాల్సి వచ్చింది వాళ్ళని. అది అక్కడితో ఆగలేదు. జూన్ 2వ తేదీన వాళ్ళు యోగి వేమన విశ్వవిద్యాలయానికెళ్ళి వైస్ ఛాన్సలర్ గారిని కలిసి ఈ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి చాలా ఎక్కువ చేస్తున్నాడు. ఆయన రిటైర్డ్ ప్రొఫెసర్. ఆయనను ఎందుకు ఇంకా పెట్టుకున్నారు? వెంటనే బైటికి పంపించేయండి. లేకపోతే మేం పెద్ద వుద్యమం లేవదీస్తాం. సెంట్రల్ గవర్నమెంట్ దృష్టికి తీసుకుపోతాం అని కంప్లయింట్ ఇచ్చారు. ఆ ప్రాసెస్ నడుస్తోంది. రేపో ఎల్లుండో వారు కోరుకుంది నెరవేరేట్టుగా వుంది.

సీవీ గారి సాహిత్యంలో మార్క్సిస్టు దృక్పథం ఏమిటీ అనే అంశం మీద నేను మాట్లాడవలసి వుంది. వకుళాభరణం రామకృష్ణగారు ఆంధ్రాలో సాంఘిక ఉద్యమ తిరుగుబాటు అనేటటువంటి సీవీగారి గ్రంథానికి ముందుమాట రాస్తూ ఈ గ్రంథం 1981లో వచ్చినా, దీని ప్రాధాన్యత అప్పటికంటే నేడే ఎక్కువగా వుందేమోనని, ఒక మాటన్నారు. అలాగే మరొక పుస్తకానికి ముందుమాట రాసిన సిద్ధయ్యగారు కూడా ఇలాంటి అభిప్రాయమే వ్యక్తం చేశారు. 2010 కి ముందు నేను ఒకే ఒక పుస్తకం చదివాను సీవీగారిది. అది ఖడ్గసృష్టి కావ్య పరామర్శ. ఇప్పుడు ఆయన కావ్యాలన్నీ చదివాను. చదివితే ఆయన రాసిన కాలానికంటే కూడా ఇప్పుడే సరైన ప్రాధాన్యత వుందని చెప్పి నాకు అనిపిస్తోంది గనుక మనం అందరం ఈ గ్రంథాలన్నీ చదవాలి. చదివి, జీర్ణం చేసుకుని వాటికనుగుణంగా ఆలోచించడం, ఆచరించడం మన కర్తవ్యమని నేను భావిస్తూ వున్నాను. వీలైతే వీటిని ఇంగ్లీషులోకి అనువాదం చేయించేటువంటి ఆ బాధ్యతను తీసుకుంటే కూడా

బాగుంటుందని నాకనిపిస్తోంది. ఇక సత్యకామ జాబాలి లాంటి గ్రంథాలను ఇంగ్లీషులో గనుక అనువాదం చేయగలిగితే దేశవ్యాప్తంగా ఈ ఆలోచనలు పాకడానికి అవకాశం వుంటుందనుకుంటున్నాను. సీవీ గారు 1965 ప్రాంతం నుంచి 2000 సంవత్సరం దాకా రాసిన ఆయన పుస్తకాలు ఇప్పుడు మనకు లభిస్తూ వున్నాయి. ఈ పుస్తకాల్లో ఆయన ఏఏ ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలను విమర్శించారో అవన్నీ కూడా ఇంకా బలపడి మూర్తీభవించి, ఈరోజుకి పాకం పండిన దశకు చేరుకున్నాయి గనుక ఆయన సాహిత్యాన్ని ఇంకా బాగా మనం చదవాలని చెప్పేసి నా సూచన. ఈయన కవిగాబట్టి ఏదో ఊహించి రాసిన కవిగాదు. చాలా పరిశోధన చేశాడు ఆయన. కావ్యాన్ని రాయడానికి ముందుగా ఒక పెద్ద ఉపోద్ఘాతం రాస్తారు. ఎప్పుడో నార్ల వెంకటేశ్వరరావు లాంటి వారు పెద్ద పెద్ద ఉపోద్ఘాతాలు రాసుకునే వారు కావ్యాలలో ముందుమాటగా. ఆ ధోరణి కలిగినటు వంటి కవి మన సీవీ గారు.

*మార్క్సిజం ఏం చెపుతుందంటే ఓ గాయకుడా! నువ్వు గంధర్వుడివి. అయితే నువ్వు ఎటువైపు అని ప్రశ్నిస్తుంది. ఎటువైపు అంటే పదవుల వైపా, ప్రజలవైపా. పీడకుల వైపా, పీడితుల వైపా. సీవీగారు పీడితుల వైపున్నారు. ప్రజలవైపు ఉన్నారు. అందుకనే ఆయన్ను ప్రజాకవి, ప్రజారచయిత అని నిర్వచించుకోవచ్చు.*

అలాగే భారతదేశాన్ని నిర్దిష్ట, సామాజిక పరిస్థితులకు అన్వయించి రాసిన కవి, రచయిత సీవీ గారు. ఈయన ఒక మాట ఎక్కువ సార్లు వాడాడు. ఆయన ప్రతీ పుస్తకంలోనూ, ఎక్కడో ఒకచోట నిష్టదరిద్రులు అనే మాట వస్తా వుంటది. ఆ నిష్టదరిద్రుల పక్షం సీవీగారు. మరొక మాట కూడా తెచ్చారు. అదేమిటంటే భారతీయ నీగ్రోలు అన్నాడాయన. దళితుల్ని భారతీయ నీగ్రోలన్నాడు. ఇది ఆయన పక్షపాతం. మార్క్సిజం ఏం చెపుతుందంటే ఓ గాయకుడా! నువ్వు గంధర్వుడివి. అయితే నువ్వు ఎటువైపు అని ప్రశ్నిస్తుంది. ఎటువైపు అంటే పదవుల వైపా, ప్రజలవైపా. పీడకుల వైపా, పీడితుల వైపా. సీవీగారు పీడితుల వైపున్నారు. ప్రజలవైపు ఉన్నారు. అందుకనే ఆయన్ను ప్రజాకవి, ప్రజారచయిత అని నిర్వచించుకోవచ్చు.

భారతీయ నిర్దిష్ట పరిస్థితులు అంటే ఇప్పుడు దళిత బహుజనవాదులు. అంటే ఏమిటంటే మార్క్సిస్టుల గురించి. వీళ్ళు యూరోపియన్ సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని కార్ల్ మార్క్స్, ఎంగెల్స్ లాంటి వాళ్ళు తయారు చేసినటువంటి సిద్ధాంతాల్ని ఆర్థిక సమానత్వపు సిద్ధాంతాన్ని భారతదేశంలో యాంత్రికంగా అనువదిస్తున్నారు. కాబట్టి యాంత్రిక వర్గ సిద్ధాంతమని దళిత బహుజన వాదులంటున్నారు. కుల సిద్ధాంతం కూడా యాంత్రిక సిద్ధాంతంగా, యాంత్రిక కుల సిద్ధాంతంగా మారిపోతుందని కూడా ఆలోచించవలసిన అవసరం వుంది.

ఈ సందేహాలకు తావు లేకుండా సీవీ గారు మార్క్సిజాన్ని తీసుకున్నారు, భారతీయ సమాజంలో ఎవరు నిజమైన పీడితులో దళితులు, బహుజనులు, స్త్రీలు, శ్రామికులు వాళ్ళకు అన్వయించి వాళ్ళ మాటలో చెప్పాలంటే సీవీగారు భారతీయ మార్క్సియ రచయిత లేదా దేశీయ మార్క్సియ రచయిత అంటే సరిపోతుందని నేను భావిస్తూ వున్నాను. దేశీయ మార్క్సియ రచయిత అంటే మన భారతదేశంలో వున్నటువంటి నిర్దిష్టపరిస్థితులకు అన్వయించడమే దేశీయత అయితే సీవీ గారు మంచి దేశీయ మార్క్సియ రచయిత అని చెప్పొచ్చు.

వారి కావ్యాలు ఏడు. రెండు విమర్శ గ్రంథాలు. ఇతర గ్రంథాలున్నాయి. వీటిల్లో మార్క్సిజాన్ని మనం ఎలా చూడాలి? అంటే ముందు మార్క్సిజం అంటేఏమిటో తెలియాలి కొంతవరకు. మీకందరికీ తెలియదని కాదు, ఇదొక మెథడాలజీ అనుకుంటున్నాను నేను. సమాజాన్ని వర్గ దృష్టితో దర్శించేటటువంటి సిద్ధాంతం, జ్ఞాన సిద్ధాంతం మార్క్సిజం. మార్క్సిజం భౌతిక వాదాన్ని ప్రతిపాదిస్తుంది. భావ వాదాన్ని వ్యతిరేకిస్తుంది. భౌతిక వాదమంటే మనకు కనిపిస్తున్నదంతా ఎవడో దీన్ని సృష్టించలేదు, గతి తార్కిక చారిత్రక భౌతిక వాదమూ, మార్క్సిజానికి తాత్విక నేపథ్యం. సమాజం నిరంతరం మారుతూ వుంటుంది. పదార్థం మారుతుంది అని చెప్పేటువంటివి సూత్రాలు. మనిషిని చరిత్ర నిర్మాతగా గుర్తించేది భౌతిక వాదం. మార్క్సిజం మానవుడే చరిత్ర నిర్మాత అని చెప్తుంది. మానవుని ప్రమేయం లేకుండా, శ్రమలేకుండా ఈ ప్రపంచంలో ఏదీ ఉత్పత్తి కాదని మార్క్సిజం చెప్తుంది

అలాగే సమసమాజ కాంక్ష వుంటుంది. అందరూ ఒకటే కావాలి ఈ సమాజంలో. పీడకులు, పీడితులు లేకుండా వుండాలి. సంపన్నులు, పేదవాళ్ళు లేకుండా వుండాలి. అనేటువంటి సమానత్వ సిద్ధాంతాన్ని మార్క్సిజం ప్రతిపాదిస్తుంది. శ్రామిక పక్షపాతం వహిస్తుంది మార్క్సిజం. సామ్రాజ్యవాదాన్ని నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తుంది మార్క్సిజం. పెట్టుబడిదారీ వ్యవస్థను, భూస్వామ్య వ్యవస్థను తిరుగు లేకుండా దెబ్బకొట్టడానికి వుద్యమిస్తుంది మార్క్సిజం. చరిత్రపట్ల గానీ, వర్తమానం పట్లగానీ, ఆరాధనా భావం వుండదు మార్క్సిజానికి. విమర్శనాత్మక దృక్పథం మాత్రమే వుంటుందన్న మాట. పునాది, ఉపరితలము అనేది ఒక గొప్ప మార్క్సిస్టు సిద్ధాంతం. ఆర్థిక శాస్త్ర పునాది ఎలా వుందో, పైన సామాజిక శాస్త్రాలు, నీతి శాస్త్రాలు, ధర్మశాస్త్రం, సాహిత్యం, కళలన్నీ కూడా పునాది ఎలా వుందో దాన్ని బట్టి వుంటాయి అంటుంది మార్క్సిజం. ఇలాంటివి కొన్ని మన మార్క్సిస్టు సిద్ధాంతాలున్నాయి.



ఇందులో రెండు వర్గాలున్నాయి. కమ్యూనిస్టు మానిఫెస్టోలో మొట్టమొదటి వాక్యం మనకు తెలిసిన చరిత్రంతా కూడా వర్గపోరాటాల చరిత్ర అని చెపుతున్నాం. దోపిడీ చేసేవాడు, దోపిడీకి గురయ్యేవాడు. పాలకులు, పాలితులు ఈ రెండు వర్గాల మధ్య నిరంతర సంఘర్షణ జరుగుతోంది.

వారు ప్రాచీన భారతంలో చార్వాకం అనే గ్రంథంలో ఒకటి రాశారు. రామాయణంలో రావణాసురుడికి, రాముడికి యుద్ధం. రాముడు దేవుడు, రావణాసురుడు రాక్షసుడు. వీళ్ళిద్దరి మధ్య జరిగే యుద్ధం. మన సంప్రదాయంలో ఏమని పిస్తుందంటే ఇది మంచికి, చెడుకు జరిగిన యుద్ధంలా అనిపిస్తుంది. ఆధునిక సిద్ధాంతాలు కొన్ని ఏం చెప్తాయంటే ఆర్యులకు, ద్రావిడులకు మధ్య జరిగిన సిద్ధాంతం, ఆర్యులు వచ్చి ద్రావిడులను చంపి ఇక్కడ రాజ్యం స్థాపించుకున్నారు గనుక రాముడు ఆర్యుడు, రావణుడు ద్రావిడుడు అని ఒక వాదం చెప్తోంది.

కానీ సీవీగారు ఆ సిద్ధాంతాన్ని పక్కన పెట్టి ఆయన ఏం చెబుతారంటే రామాయణంలో కనిపించే రామ, రావణులు నాటి ఆర్య, ద్రావిడ పాలక వర్గాలకు చెందినవారు. రాముడు ఆర్యుడు. రావణుడు ద్రావిడుడు. కానీ వీళ్ళిద్దరూ కూడా పాలకవర్గాలకు చెందినటువంటి వాళ్ళు. అనంటారు. అంటే ఆ పాలకవర్గము అనే మాటే మార్క్సిస్టు మాట అన్నమాట. వీరిలో ఎవరినీ సమర్థించవలసిన అవసరం నేటి పాఠకులకు లేదు. ఒకటి ఇసుక తక్కెడ, రెండవది పేడ తక్కెడ. రావణుని చెల్లెలయిన శూర్పణఖను తన తమ్ముడైన లక్ష్మణుని చేత ముక్కూ చెవులూ కోయించాడు. ఆ కక్ష తీర్చుకోవడానికి రావణుడు రాముని భార్యను లంకకు ఎత్తుకుని వెళ్ళాడు. రామ రావణ యుద్ధానికి కాంతా, కనకాలే పై కారణాలుగా కనిపించినా వాస్తవానికి ఆర్య, ద్రావిడ పాలక వర్గాల మధ్య అధికారం, రాజ్య విస్తరణ కోసం రగిలిన భయంకర శతృత్వమే ఈ దారుణ మారణ మానవ హోమానికి దారి తీసిందని పాలకవర్గాల మధ్య వచ్చిన సంక్షోభమే రామాయణ కథ అని చెప్పడమే సరైనటువంటి అంచనా అని సీవీగారు మనకి చెప్తున్నారు. మనం నేర్చుకోవాల్సింది అది వారి నుంచి. భారతాన్ని కూడా మనం అలాగే చూడాలి. ప్రాచీన కవులు ఏం చేస్తారంటే విజేతల పక్షం వహిస్తారు. అందుకనే ధర్మరాజు నాయకుడైనాడు, రాముడు నాయకుడైనాడు. దుర్యోధనుడు, రావణుడు విలన్లు అయిపోయారన్నమాట.

ఆ తర్వాత ఆయన డార్విన్ పరిణామ గ్రంథంలో ఇంకా స్పష్టంగా ఏం చెప్పారంటే జీవ పరిణామ క్రమంలో శిఖరాగ్రాలకు చేరినవాడు మానవుడు. నేడు మానవుడు మానవుడుగా జీవించడానికి అవకాశం లేకుండా వుంది. దీనికి కారణాలు నాలుగు అని చెప్పారాయన. ఏమిటా నాలుగంటే ఒకటి దేవుడు, రెండు మతం, మూడు కులం, నాలుగు వర్గం అన్నాడన్నమాట. ఒక కులాన్ని చెప్పలేదాయన. ఒక వర్గాన్ని చెప్పలేదు. కులము వర్గము చెప్పాడు.

దాంతోపాటు మతాన్ని దేవుణ్ణి కలిపాడు. ఇది ఆయన భౌతిక వాదానికి చక్కటి నిదర్శనమని నేను భావిస్తూ వున్నాను. అందుకనే ఆయన ఏమంటాడంటే ఈ దేవుణ్ణి, మతాన్ని, కులాన్ని, వర్గాన్ని ఈ దేశం నుంచి వెళ్ళగొట్టి, ఈ నాలుగు లేని సమాజంలో తప్ప మనిషి మనిషిగా బతకలేడని చెప్పి చాలా నిర్ద్వంద్వంగా చెప్పారు సీవీగారు.

మనమందరము చాలామటుకు భౌతిక వాదులుగానే వుంటాం. మార్క్సిస్టులుగానే వుంటాం. కాని ఎప్పుడో ఒకప్పుడు ఈ నాలుగింటిలో ఏదో ఒక దానిలో మన బలహీనత బయటపడుతూ వుంటుంది. మనలో ఆ బలహీనతలు వున్నంత వరకు మనము సరైన మార్క్సిస్టులమని అనుకోవడానికి వీలులేదు. మనం సమాజాన్ని మార్చడం కూడా చేతకాదన్నమాట. కాబట్టి ఈ నాలుగింటికి మనం ఎప్పుడు దూరంగా వుంటామో అప్పుడే మనం నూతన సమాజాన్ని నిర్మించగలం.

సాంస్కృతిక విప్లవం గురించి మనం మాట్లాడుకునే సమయంలో మన ఆర్థిక రాజకీయ పోరాటాలు నిర్వహిస్తూనే, వాటిని అడ్డగిస్తున్నటువంటి ఈ కులాల సమస్యను కూడా పరిష్కరించుకోవాలని వారు మనకు హెచ్చరించారు.

తరువాత భారతజాతి పునరుజ్జీవనం 1984లో చేశారు. అప్పటికి కారంచేడు, చుండూరు సంఘటనలు జరగలేదు. దళిత ఉద్యమం మొదలు కాలేదు. మార్క్సిజమే ప్రధాన స్రవంతిగా వుంది మనకి. ఆనాటికే వారు ఒక ఆలోచన ఏం చేశారంటే, వర్గ పోరాటం నిర్వహించే సమయంలో కులమొక సమస్యగా తలెత్తుతుంది అని హెచ్చరించాడు ముందుగానే. ఒక వర్గంగా శ్రమజీవుల అవతరణను కుల వ్యవస్థ అడ్డగించడమే కాక ఈ కుల మహమ్మారి పేద ప్రజల్లో కూడా చీలికలు సృష్టించి వారిలో వారికి తంపులు పెట్టి తమాషా చూస్తుంది జాగ్రత్త వహించండి అని చెప్పాడన్నమాట. సాంస్కృతిక విప్లవం గురించి మనం మాట్లాడుకునే సమయంలో మన ఆర్థిక రాజకీయ పోరాటాలు నిర్వహిస్తూనే, వాటిని అడ్డగిస్తున్నటువంటి ఈ కులాల సమస్యను కూడా పరిష్కరించుకోవాలని వారు మనకు హెచ్చరించారు.

డా॥ బి.ఆర్. అంబేడ్కర్ చెప్పింది కూడా ఇదే. ఆర్థిక విప్లవం రావాలి. రాజకీయ విప్లవం రావాలి. అయితే పాశ్చాత్య దేశాల్లో ఇవి వచ్చేస్తాయి. కాని భారతదేశంలో ఆర్థిక, రాజకీయ విప్లవాల కన్నా ముందుగా సాంఘిక విప్లవం రావాలి. రాకపోతే రాజకీయ, ఆర్థిక విప్లవాలు రావు. వచ్చినా చాలా వికారంగా వుంటాయని అన్నాడాయన.[8]

అందుకోసం కులాన్ని విస్మరించడానికి వీలులేదని 1984లోనే సీవీగారు మనకు గుర్తు చేశారు. కేవలం ఆర్థిక అంతస్థును మాత్రమే పరిగణనలోకి తీసుకుని కుల వ్యవస్థ అమల్లో వున్న మన సమాజంలో వర్గ సంబంధాలన్ని వర్గ స్థాయిని బేరీజు వేయడం తొందరపాటు కాగలదేమో. అంచేత ఇండియాలో వున్న వర్గానికి వర్గానికి మధ్య ఈ ఫండమెంటల్ రూళ్ళ కర్ర సిద్ధాంతాన్ని బట్టీకొట్టడం అవివేకం కాగలదు అన్నాడు. అంటే యాంత్రిక వర్గ వాదం వద్దని సీవీ గారు మనకు చెపుతున్నారు.

అలాగే కుసుమ ధర్మన్న మీద. మనం జాషువాను బాగా చదువుకున్నాం. సీవీ గారిని ఒదిలివేసినట్టుగానే, కుసుమ ధర్మన్నను కూడా మనం పట్టించుకోలేకపోయాము. కారణమేమిటో మరి తెలియదు గానీ. కుసుమ ధర్మన్న మీద చాలా అద్భుతమైన విమర్శ రాశారు. ఆ విమర్శలో కూడా ప్రపంచంలోని మిగతా దేశాల్లో ధనికులు, దరిద్రులు అనే వర్గ భేదం మాత్రమే వుంది. కాని ఇండియాలో ఈ వర్గభేదాలతోపాటు, అగ్ర, అధమ వర్ణ భేధము కూడా వున్నది. ఆర్థికంగా ఎంతో బీదవాడైన బ్రాహ్మణుడు ధనికుడైన శూద్రునికన్నా అధికుడే. ఆర్థికంగా పేదవాడైన రెడ్డి, లేదా కమ్మ వ్యక్తి ధనికుడైన మాలవ్యక్తి కన్నా సాంఘికంగా గౌరవనీయుడుగా వున్నాడు మన సమాజంలో. కాబట్టి కులమనేటటువంటిది ఏనాటికీ మనం విస్మరించడానికి వీలు లేనటువంటి విషయం.

ఆయన బ్రాహ్మణేతర ఉద్యమం గురించి మాట్లాడుతూ చాలా సులభమైనటువంటి భాషలో చెప్పారు. ఇవన్నీ మనం జాగ్రత్తగా గమనించామంటే మార్క్సిజాన్ని, అంబేద్కరిజాన్ని అన్వయించుకుని ఈ సిద్ధాంతంలోకాని, ఆ సిద్ధాంతంలోకాని, యాంత్రికత కాకతాళీయతను పరిహరించుకుని, శాస్త్రీయంగా మనం వర్గ, వర్ణ రహిత భారత దేశాన్ని నిర్మించుకోవడానికి వీలవుతుంది.

స్వాతంత్ర్య ఉద్యమం మీద ఆయనకు చాలా

గౌరవముంది. అప్పట్లో ప్రజలు చేసిన త్యాగాల మీద ఆయనకు చాలా గౌరవం వుంది. కాని దాని ఫలితం మీద మాత్రం అసంతృప్తి వుంది. పొద్దున్నుంచీ మనం చెప్పుకున్నాం మాకొద్దీ తెల్లదొరతనం దేవా... మాకొద్దీ తెల్లదొరతనం అని గరిమెళ్ళ సత్యనారాయణ పాడితే ఆ సమయంలోనే మాకొద్దీ నల్లదొరతనం దేవా... మాకొద్దీ నల్లదొరతనం అని కుసుమ ధర్మన్న పాడాడు.

**సీవీ గారిని అధ్యయనం చేయాలంటే మనకు చాలా ధైర్యం వుండాలి. డిస్టర్బ్ కావడానికి సిద్ధపడితేనే ఆయన సాహిత్యం చదవాలి మనం. వెన్నెల్లో కూర్చుని చదువుకుందాం అంటే ఆయన మీకు సహకరించడు.**

చివరికి 47 ఆగస్టు 15న జరిగింది ఏంటంటే సీవీ గారు తెల్లదొరల సీట్లలో నల్లదొరలు భేషుగ్గా ఆశీనులయ్యారు అన్నాడు. ప్రజాస్వామ్యము అని పేరు పెట్టుకుంటున్నాం గానీ మనం, మన దేశంలో ఇంకా నిజమైనటువంటి ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడలేదు అని చెప్పారు. దానికోసం తిరిగి మనం ఉద్యమించాలి అని చెప్పి ఆయన బోధించారు. ధనం అనేటటువంటి రాహువు ప్రజాసూర్యుణ్ణి మింగేసింది అన్నారు

ధనస్వామ్య వ్యవస్థ బలిసిపోయిన ఎన్నికల నేపథ్యంలో. ఎన్నికల రూపంలో. ఎన్నికలు జరిపి, మనం ప్రజాస్వామ్యాన్ని ఎన్నుకుంటున్నాం. కానీ అది ప్రజాస్వామ్యం కాదు. అది ఆయన ఆవేదన అన్నమాట. అందుకోసమని ఆయన కారుచీకట్లో కాంతిరేఖ అనే కావ్యంలో ఒక మూడు కవితలు రాశాడు. అవి కోటిగొంతులు విప్పి ఘోషించండి అని ఒక కవిత. మీరు మిన్ను మేము మన్ను ఒక కవిత. అరుణా! అరుణ పతాకమా! అనే మరో కవిత. ఈ మూడు కవితలు మార్క్సిజం పట్ల సీవీగారి కున్నటువంటి అవగాహనకు చక్కని ఉదాహరణలు.

రష్యా పతనం తర్వాత మార్క్సిజానికి కాలం చెల్లింది. కమ్యూనిజానికి కాలం చెల్లింది. మార్క్స్ గురించి మాట్లాడేవాడు లేదా సమసమాజాన్ని గూర్చి మాట్లాడేవాడు చాదస్తుడి కింద లెక్కయితాడన్నమాట. నువ్వు ఎట్లయినా సంపాదించు. సాయంకాలానికి ఎంత సంపాదించావు. విదేశీయుల్ని తరిమిగొట్టేశాం అని అనుకుంటున్నాం గానీ, విదేశీయులు ఎక్కడికి పోలేదు. అప్పుడొచ్చి ఇక్కడ పరిపాలించారు. ఇప్పుడు దూరం నుండి పరిపాలిస్తున్నారు. ప్రపంచీకరణ మహిమ ఏంటంటే వాడు అక్కడే వాడింట్లో వుంటాడు. మనం మనింట్లోనే వుంటాం. మనల్ని వాడే పరిపాలిస్తూ వుంటాడు. ఇది ప్రజాస్వామ్యం కాదు.

శ్రీశ్రీ గారి వ్యత్యాసాలు అనే కవిత మీలో అందరూ చదివే వుంటారు. ఆ నమూనాలో సీవీ గారు 'మీరు మిన్ను మేము మన్ను' రాశారు.

చివరికి దీనికేమిటి పరిష్కారం అంటే ప్రజాఉద్యమం తప్ప ఇంకేమీ కాదు. చిట్టచివరికి ఆయన రాసింది మాకూ కావాలి సాంస్కృతిక విప్లవం అంటాడన్నమాట.

అంటే సమస్యను ఏకరువు పెట్టేసి కవి తప్పించుకోకుండా, ఇదిగో ఇది అని ఆయన చెపుతున్నాడు. దోపిడీ వర్గాన్ని నాశనం చేసినపుడే జరుగుతుంది జాతికి సమగ్ర న్యాయం. పోరాటమే నేటి జీవిత సమస్యల పరిష్కారం. పోరాటమే నేటి దేశానికి నిత్య అవసరం. పోరాటం లేని కుక్క బతుకుల జీవితం పడుతుంది ఎంగిలి మెతుకుల ఆరాటం.. మండుతున్న వర్గ చైతన్యమే మీ చేతిలోని ఆయుధం. అభేద్యమైన ఐకమత్యమే మీ చేతిలో గాండీవం. అంచేత రండి మానవులారా! రాక్షస సంహారానికి పదండి. దిక్కులేని వాళ్ళలారా పందులు వేటాడేందుకు కలిసి రండి. అని ఆహ్వానం పలికారాయన. కాబట్టి ఆయన చాలా తాజాగా వున్నారు సీవీగారు. వయసులో పెద్దవారైనా ఆలోచనలో చాలా తాజాగా వున్నారు.

సీవీ గారిని అధ్యయనం చేయాలంటే మనకు చాలా ధైర్యం వుండాలి. డిస్టర్బ్ కావడానికి సిద్ధపడితేనే ఆయన సాహిత్యం చదవాలి మనం. వెన్నెల్లో కూర్చుని చదువుకుందాం అంటే ఆయన మీకు సహకరించడు. నన్నయను చదువుకుంటే హాయిగా వుంటుంది. తిక్కనను చదువుకుంటే హాయిగా వుంటుంది. కానీ కందుకూరి, వేమన, గురజాడ, శ్రీశ్రీ, కుసుమ ధర్మన్న, సీవీ లాంటోళ్ళు మన మెదడును డిస్టర్బ్ చేస్తారు. ఆ డిస్టర్బ్ చేసే సాహిత్యాన్ని సృష్టించినందుకు వారికి నేను మనసారా నమస్కరిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

# దార్శనికుడు సివి

◆ కొత్తపల్లి రవిబాబు




సీవీ గారి ప్రాపంచిక దృక్పథం మార్క్సిజం. ఆయన రాసిన కొన్ని వేల పేజీల్లో కొన్ని వేల కవితా పంక్తుల్లోగానీ, వచ్చినవాటిల్లో కానీ, మార్క్సిజం తొణికిసలాడుతుంది. కొన్ని సామెతలు, సంప్రదాయసిద్ధంగా, ఇందాక అదృష్టం, దురదృష్టం గురించి మాట్లాడుకున్నట్లుగా కొన్ని సామెతలు వాడటంలో మాత్రం ఒక నాలుగైదు చోట్ల మాత్రమే మొత్తం ఇన్ని వేల పేజీల్లో కులాల్ని ప్రస్తావించడం, స్త్రీలని ప్రస్తావించడంలో కొంత స్త్రీలను అవమానించడం, కులాలను అవమానించడం వుంటుంది.

అది తప్ప అన్నివేల పంక్తుల్లోనూ మార్క్సిజం తొణికిసలాడుతుంది ఆయన రచనల్లో. కేరళలో మొట్టమొదట కమ్యూనిస్టు పార్టీ వస్తే దాన్ని ఏ విధంగా, అన్యాయంగా కూలదోశారో మనందరికీ తెలుసు. మరి కవులేవిధంగా స్పందించారు? ఇట్లా పార్లమెంటరీ పద్ధతిలో అధికారంలోకి వచ్చిన కమ్యూనిస్ట్ ప్రభుత్వాన్ని కూలదోస్తే కవుల స్పందనేమిటి? ఎవరైనా ఏమైనా రాశారా? అసలీ పార్లమెంటరీ రాజకీయాలు ఎట్లా వున్నాయి? ఇవన్నీ ఆయన విషాద భారతంలో రాశారు. అంతేకాదు రక్తం చిందకుండా జరగదు నూత్న శిశు ఉదయం అన్నాడు. ఇంకోచోట.

ఆ టైములోనే శ్రీశ్రీ మద్రాసులో సినీ లోకంలో వున్నాడు. ఏమయ్యా నువ్వు గురువుగా అనుకున్నాను నేను. అందరికీ స్ఫూర్తి నివ్వాల్సిన వాడివి. ఇన్ని అన్యాయాలు జరుగుతుంటే మాట్లాడకుండా, రాయకుండా, అక్కడ కూర్చున్నావేమి అని ఒక హెచ్చరిక లాంటిది చేశాడు. శాసించాడన్నమాట. శ్రీశ్రీని శాసించాడు.

ఆధునిక ప్రజాస్వామ్యం ఒక పొద్దు తిరుగుడు పువ్వు. ఆధునిక ప్రజాస్వామ్యమొక సానిదాని నవ్వు. ఆధునిక సమాజమొక ప్రాస్టిట్యూట్. ఓటు దాని గేటుకు చెల్లించే రేటు. అని 1965లోనే కుళ్ళి కంపుగొడుతున్నటువంటి భారత పార్లమెంటరీ వ్యవస్థ గురించి... ఇప్పుడు ఇంకా కుళ్ళిపోయిందనుకోండి. ఆయన ఒక దార్శనికతతో రాశాడు. అప్పట్లోనే కావాలి మనకొక సాంస్కృతిక విప్లవం అని రాస్తూ, ఆయన ఒక చోట అంటున్నాడు కమ్మ కమ్యూనిస్టు యువతుల్ని, రెడ్డి కమ్యూనిస్టు లతాంగిని, కాపు కమ్యూనిస్టు కన్యని చూసి వర్ణాంతర వివాహాలు ఊరి పొలిమేరలు దాటి పారిపోతున్నాయి. ఇటువంటి కులాంతర

వివాహాల్ని చేసుకుంటున్నారని ఒక మార్క్సిస్టుగా ఆయన ఆనాడు నిరసించాడు.

అంతేకాదు, గోవధ నిషేధం గురించి కూడా ఆయన అప్పుడే రాశాడు. ఇప్పుడు గోవధ నిషేధం గురించి చట్టాలు చేస్తున్నారు. 1962లో విషాద భారతంలో మార్క్సిస్టుగా ఆయన రాసిందేమిటంటే..ఆకలేసి కేకలేస్తున్న జనం కోసం....విప్లవాన్ని ఆహ్వానిస్తున్నాను. ......40 నోట్ల పిడికిళ్ళనొక్కుమ్మడిగా బిగించి భూనభోంతరాలు దద్దరిల్లేట్లు మీ వాంఛల్ని ప్రతిధ్వనించండి అన్నారు.

సీవీ మార్క్సిస్టు విమర్శకుడు కూడా. మార్క్సిస్టు, సాహితీ విమర్శకుడు. ఏ విధంగా? శ్రీశ్రీ ఖడ్గసృష్టి బయటికొచ్చింది. దాంట్లో సర్రియలిజంతో రాసినటువంటి రకరకాల వేషాలూ అవన్నీ కూడా వున్నాయి దాంట్లో. దానిమీద ఎవరో ఒక సమీక్ష రాశారు. శ్రీశ్రీలో మహాప్రస్థానం నాటి సత్తా పోయింది, తగ్గిపోయింది. ఇదంతా పేలవంగా వుంది. ఖడ్గ సృష్టిలోని కవితలు గొప్పవేం కాదు అని రాసుకొచ్చారు. అప్పుడు ఈయన ఖడ్గసృష్టి పరామర్శ అనే ఒక సాహితీ విమర్శనా గ్రంథం రాశాడు. శ్రీశ్రీ రాసిన సర్రియలిజాన్ని పొగడలే. తిట్టాడు. పోస్లే ఇవన్నీ విదూషక వేషాలు. అయితే వాటిల్లో కూడా భవిష్యత్తులో ఆయన చెప్పేటటువంటి ఖడ్గసృష్టి గురించి సంబంధించి బీజాంకురాలు వున్నాయని చెప్పాడు.

ఆయన సర్రియలిస్టు కవిత్వంలో కూడా రావలసినటువంటి విప్లవాన్ని ఏ విధంగా కోరుతున్నాడో అనేది ఆయన సాహిత్య విమర్శలో రుజువు చేశాడు. అంతేకాదు గురజాడ, శ్రీశ్రీ, సోమసుందర్ మీద దాడి చేస్తే ఆ దాడికి ఆయన ఒక మార్క్సిస్టు సాహిత్య విమర్శకుడుగా సమాధానమిచ్చాడు. సోమసుందర్ వజ్రాయుధం అనేదాంతోనే ఒక అభ్యుదయ కవిగా వున్నాడు. నిజాంని, నిజాం పాదుషాని ఖబడ్దార్ అన్నాడు. ఆ తరువాత రాసినవన్నీ ఏ అభ్యుదయం వుంది దాంట్లో. నువ్వు గురజాడని, శ్రీశ్రీని తిట్టేవాడివయ్యావా? అని సోసు రాసిన కవితలు ఒకవైపు, గురజాడ రాసినవి ఒకవైపు పెట్టి, ఆయన పీఠికల్లో సమాధానాలు రాశారు. అటు విశాలాంధ్రలో వచ్చినై, ఆ తరువాత పీఠికల్లో కూడా పునర్ముద్రించారు అన్నమాట. ఆ విధంగా మనం మార్క్సిస్టు సాహితీ విమర్శకుల్లో కూడా సివిని చేర్చాల్సినటువంటి అవసరం వుంటుంది.



'ప్రజాసాహితిలో సమరశీల కలంయోధుడు' పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న సివి, సివి సహచరి భారతి. చిత్రంలో జనసాహితి అధ్యక్షులు దివికుమార్

ఆ క్రమంలో ఆయన శిల్పం గురించి వాటి గురించి రాసేటప్పుడు ఒకచోట అంటారాయన. ఇతివృత్తమూ, శిల్పమూ రెండూ రెండు చక్రాల్లాంటివి. ఇవి సమాన వేగంతో నడిచినపుడే బండి సవ్యంగా పోతుంది అని. శిల్పం గురించి, రూపం గురించి, వస్తువు గురించి జరిగినటువంటి చర్చల మీద ఆయన ఆ విధంగా చెప్పారు. అంతేకాదు, ఆయన రాసిన సాహిత్య వ్యాసాల్లో తిలక్ రాసినటువంటి కొన్ని కవితలు, తిలక్ రాసినటువంటి కొన్ని కథలు, చక్కగా ఆయన విశ్లేషిస్తారు.

ముదిగొండ శివప్రసాద్ అని వున్నాడు ఒకాయన. ఆయన మహాప్రస్థానానికి బదులుగా మహాసర్గ అనే ఒక పుస్తకం రాశాడు. పదండి ముందుకు. పదండి తోసుకు అని శ్రీశ్రీ అంటే, అదే టైపులో జనసంఘం పార్టీ పద్ధతిలో అవన్నీ రాసుకొచ్చాడు. రూపం అదే. భావం మాత్రం జనసంఘం పార్టీ భావతత్వంతో వుంటుంది. ఆ మహాసర్గని విమర్శించిన వాళ్ళలో నాకు ఇద్దరే కనపడ్డారు. ఒకరు సీవి, ఇంకొకరు నాగళ్ళ గురుప్రసాద్ గారు. కొన్ని పత్రికలు పొగిడేసినయ్. నాగళ్ళ గురుప్రసాద్ గారు భారతి పత్రికలో వేరే పేరుతో రాశాడాయన. ఆయన విజయవాడలోనే

వుంటున్నారు. మహాసర్గని చీల్చి చెండాడుతూ రాశాడు. తరువాత సివి గారు రాశారు. మహాసర్గపై విశ్లేషణ.

ముదిగొండ శివప్రసాద్ గారు ఇప్పుడు హైదరాబాదులోనే వున్నారు. సినిమాల్లో వున్న వాటిమీద పత్రికల్లో వాటిల్లో రాసన్తా వుంటారు. ఆయనేమంటున్నాడంటే... 1966లో వచ్చిందిది. గతి తార్కిక భౌతిక వాదం... మతి హీనుల మాయాజాలం. వెతలెరుగని నరలోకంబును చితికంపెడు సింహద్వారం. ఏ మార్క్సిస్ట్ అయినా ఊరుకుంటాడా? చాలామంది ఊరుకున్నారు. సీవీ ఊరుకోలా. మహాసర్గ మీద చీల్చి చెండాడుతూ ఏమిటి? వీడు చెప్పేదేమిటి? ఆయనలోని వైరుధ్యాలు కూడా చక్కగా చెప్పాడు. ముదిగొండ శివప్రసాద్ రాసినదాంట్లో ఏముంటదంటే జనశక్తిలో వచ్చిన ఒకదాన్ని జనశక్తిలో అరుణశ్రీ పేరుతోనో, లేకపోతే సి.విజయలక్ష్మి పేరుతోనో వచ్చినటువంటి దాన్ని చీల్చి చెండాడుతూ ఇంకొకటి రాశాడు. అప్పుడు ఇంకోచోట ముదిగొండ శివప్రసాద్ ఏమని రాశాడంటే జనశక్తి సంపాదకవర్గాన్ని, సకుటుంబంగా అరుణశ్రీని సజీవంగా దహనం చేయమని సలహా ఇచ్చాడు ఒక వ్యాసంలో. ఒక సాహిత్య విమర్శకుడుగా సీవీని ఆ విధంగా మనందరం గుర్తుంచుకుందాం.

**ఆ మహాకావ్యానికి 50 పేజీల పీఠిక రాసి అసలు పారిస్ కమ్యూన్ యొక్క చరిత్ర అంతా మనం తేలిగ్గా అర్థం చేసుకునేటట్లుగా ఆయన రాశాడు. ఇందాక ఒక మిత్రుడు చెపుతున్నాడు. ఏమిటి మార్క్సిస్టు రచయిత యొక్క కర్తవ్యం. సాధారణ పాఠకులు తేలిగ్గా అర్థం చేసుకునేటట్లు చెప్పడం. సీవీ ఆ పని చేశాడు.**

తరువాత ఒక మార్క్సిస్ట కవి గాని, ఒక మార్క్సిస్టును నమ్మినవాళ్ళుగాని, తమకున్నటువంటి జ్ఞానాన్ని యితరులకు పంచాలి. కనుక ఆయన కొన్ని సిద్ధాంత గ్రంథాలు రాశారు. భారతీయ పునరుజ్జీవనమని, వర్ణ వ్యవస్థ అనీ, అదే విధంగా మధ్యయుగాల్లో కుల వ్యవస్థ అనీ కొన్ని కవిగా కవిత్వం రాస్తానో, ఎమోషనల్గా రాస్తానో చాలా ఆలోచించి, చాలా గ్రంథాలు పరిశోధించి, చాలా దినపత్రికలు పరిశోధించి, ఆయన రాసిన గ్రంథాలు , చూసినటువంటి రిఫరెన్స్ గ్రంథాలను కనుక చూస్తే ఆయన ఎంత పరిశోధించాడో మనకు తెలుస్తుంది. సీవీ గారితో ఎప్పట్నించో నాకు పరిచయం వుంది. అయితే మీటింగులకు వచ్చేవాడు కాదు. వచ్చినా మాట్లాడే వాళ్ళు కాదు. ఇప్పుడనుకుంటున్నాం. ఆయన మీటింగులకొచ్చి వీరిని వీటిని తిడుతూ వుంటే ఆయన రాయగలిగేవాడా అని. బాగా స్టడీ చేయాలి. దానిమీద ఉద్రేకం రావాలి. ఆ తర్వాతే రాయగలుగుతాం. విరసం మొదటి మహాసభలో కొడవటిగంటి కుటుంబరావుతో సీవీ గారికి గొడవ జరిగింది కుటుంబరావు గారేమన్నారంటే కవిత్వం రాయడం తేలిక. వచనం రాయడం కష్టం అన్నారు. అంటే కథలు రాయడం కష్టం అనే పద్ధతిలో. ఈయన లేచారు. తేలికా? నేను ఊళ్ళోకి స్వాముల వారు వేం చేశారు. రాసేటప్పుడు పొద్దున్నే నాకు టైఫాయిడ్ వచ్చింది అది రాసింతర్వాత అని చెప్పారు. ఎంత ఉద్రేకపడాలి? ఎంత పరిశీలించాలి? కవిత్వం రాయడం తేలికా? అన్నారు. సరే అని చెప్పి ఉపసంహరించుకున్నాడప్పుడు.

మరొక మహత్కార్యమేమిటంటే పారిస్ కమ్యూన్ అనేటటువంటి ఒక వచన కవితా మహాకావ్యం రాశాడు. ఇంగ్లీషులో దీన్ని మనం ఎపిక్ అంటాం. ఒకదేశం యొక్క గొప్పతనాన్ని గాని, ఒక వీరుడి గొప్పతనాన్ని గాని, ఒక దేవుడి గొప్పతనాన్ని గాని, చెప్పేటటువంటి యింగ్లీషు భాషలో, లాటిన్ భాషలో కొన్నున్నయ్. ఒక ఎపిక్, ఒక మహాకావ్యానికి వస్తువుగా దేన్ని తీసుకోవాలి. వస్తువుగా పారిస్ కమ్యూన్ని తీసుకున్నాడాయన. ఆ పారిస్ కమ్యూన్ను వస్తువుగా తీసుకోవడమంటేనే మరి సమకాలీన విషయాలన్నీ ప్రస్తావించడం, చేశాడు. ఆ మహాకావ్యానికి 50 పేజీల పీఠిక రాసి అసలు పారిస్ కమ్యూన్ యొక్క చరిత్ర అంతా మనం తేలిగ్గా అర్థం చేసుకునేటట్లుగా ఆయన రాశాడు. ఇందాక ఒక మిత్రుడు చెపుతున్నాడు. ఏమిటి మార్క్సిస్టు రచయిత యొక్క కర్తవ్యం. సాధారణ పాఠకులు తేలిగ్గా అర్థం చేసుకునేటట్లు చెప్పడం. సీవీ ఆ పని చేశాడు.

# భాషను ప్రజాస్వామీకరించారు సివి

◆ ఖాదర్ మొహియుద్దీన్




**1979**లో మిత్రుడు విశ్వేశ్వరరావు ద్వారా నేను సీవీ గారిని కలిశాను. ఆ తరువాత అనేక సందర్భాల్లో ఆయనను కలవడం జరిగింది. గత పది పదిహేను సంవత్సరాలుగా విశ్వేశ్వరరావు, నేను, తమ్మిన గణపతి అని ఒక మిత్రుడు ఆయన చనిపోయాడు. ఇంకా చాలామంది మిత్రులు సీవీగారి సాహిత్యం మీద ఇటువంటిదే ఒక సదస్సు జరపాలని ఒక కలగంటూ వచ్చాం. ఆ కల నిజం చేయలేకపోయాం కానీ, ప్రజాశక్తి బుక్‌హౌస్, దాని సారధ్యంలో అనేక సంస్థలు కలిసి మా కలని నిజం చేసినందుకు నేను ముందుగా వారికి కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

మార్క్సిజానికి గీటురాయి గతి తార్కిక చారిత్రక భౌతిక వాదం. ఆ గీటురాయి మీద నిలబడిన రచనలు మాత్రమే మార్క్సిస్టు రచనలవుతాయనే అవగాహన కలిగిన అతి కొద్దిమంది రచయితల్లో, కవుల్లో అంటే తొలితరం రచయితల్లో సీవీ గారు ఒకరు. ఆ తర్వాత కాలంలో విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తర్వాత మొట్టమొదటి సారి త్రిపురనేని మధుసూధనరావుగారు ఒక ప్రసంగం చేశారు. అది పుస్తక రూపంలో కూడా వచ్చింది. గతి తార్కిక సాహిత్య భావము దాని పేరు. అందులో మొట్టమొదటిసారిగా ఆయన ఈ విషయం చెప్పాడు. మార్క్స్, లెనిన్, మావో, స్టాలిన్ సాహిత్యం, ఇంకా వాళ్ళకు యిష్టమైన సాహిత్యం ఏదైనా వుండొచ్చు. వాళ్ళు చెప్పిన అభిప్రాయాలే మనం కొలమానాలుగా పెట్టుకోవద్దు. మార్క్సిజానికి గీటురాయి గతి తార్కిక చారిత్రక భౌతిక వాదం. అది కొలమానంగా వున్న సాహిత్యాన్నే మార్క్సిస్టు సాహిత్యంగా గుర్తించాలని ఆయనొక సిద్ధాంత వ్యాసం రాస్తే ఆనాడు ఆయన ప్రాతినిధ్యం వహిస్తున్న పీపుల్స్ వార్ పార్టీ కేంద్ర కమిటీ నాయకులు అసలు మార్క్సిస్టు మహోపాధ్యాయుల్ని పక్కన పెట్టేస్తే మన పరిస్థితి ఏంటని అసలు ఆ చర్చనే తీసి పక్కన పెట్టేశారు. ఇప్పటికీ అదట్లానే వుంది. రెండో విషయానికి వస్తే భాషకు సంబంధించి, సోవియట్ యూనియన్‌లో అక్టోబర్ విప్లవం విజయవంతమైన తర్వాత అక్కడి భాషా శాస్త్రవేత్తలు ప్రధానంగా రాజకీయ రంగంలో ఒక విప్లవాన్ని విజయవంతం చేసి, ప్రపంచానికి మార్గదర్శకంగా వున్న మనం, సాహిత్య రంగంలో కూడా ఒక మౌలిక మైన కృషి చేద్దామని ప్రయత్నం చేశారు.

అట్లా ప్రారంభించిన దశలోనే వాళ్ళకు ఫార్మలిస్టులని పేరు పెట్టారు. ఇంతకుముందు ఫార్మలిస్టులనే పేరు వారు పెట్టుకున్నది కాదు. నక్సలైట్లు నక్సలైట్లని పెట్టుకున్నట్లుగానే ఆ పేరు ప్రభుత్వం పెట్టింది. ప్రధానంగా ఆనాడు కల్చరల్ ఫ్రంట్‌కి ఇంఛార్జిగా వున్న జడనోవ్ ఆ తర్వాత ఆయన్ని చాలామంది మార్క్సిస్టు విమర్శకులే కల్చరల్ ఛద్ అని విమర్శించారు. వాళ్ళేం చెప్పారంటే అసలు భాష సాహిత్యంగా మారటానికి ఏ అంశాలు ఉపయోగపడతాయి? సాహిత్యం మొత్తం భాషే కాని, భాషే సాహిత్యం కాదు.

భాషను సాహిత్యంగా మారుస్తున్న అంశమేమిటి? అది భాషా పరమైందా? భాషా సంబంధమైందా? భాషా సంబంధమైందనే తేల్చారు. వాళ్ళేం చెప్పారంటే కమ్యూనిస్టు, లేదా మార్క్సిస్టు సాహిత్యానికి అవసరమైన కొన్ని మౌలిక మైన విషయాలు చెప్పారు. అందులో ఒకటి, ఈస్థటిక్స్. ఈస్థటిక్స్ అండ్ లిటరేచర్ అని ఆలోచించినంత కాలం మార్క్సిస్టు సాహిత్యానికి కావలసిన మార్గమే దొరకదసలు. ఈస్థటిక్స్ వర్సెస్ లిటరేచర్ అని ఆలోచించడం మొదలు పెడితే కనీస మార్గమన్నా కనిపించే అవకాశముందని వాళ్ళు చెప్పారు. ఎందుకంటే ఈస్థటిక్స్‌లోనే భావజాలం ఉందనేది ప్రధానమైన విమర్శ. మార్క్సిస్టు, లేదా కమ్యూనిస్టు కళలు లేదా సాహిత్యానికి ప్రాతిపదిక ఈస్థటిక్స్ అనేది తొలగించి ఆ ప్లేస్‌లో పాలిటిక్స్ అనే పదాన్ని పెట్టినపుడు మాత్రమే కమ్యూనిస్టు, లేదా మార్క్సిస్టు సాహిత్యం సరైన రీతిలో సృష్టించడానికి అవకాశం వుంటుందని. ఇవన్నీ అధ్యయనం చేశారని కాదు గానీ, అటువంటి లక్షణం మనకు సీవీగారి సాహిత్యంలోనే చూస్తాం. నా మట్టుకు నా స్వీయానుభవంగా మీముందు స్పష్టం చేయదలచుకున్నాను. ప్రధానంగా అభ్యుదయ రచయితల సంఘం బలంగా ఉన్న కాలంలో కూడా వాళ్ళు ప్రయోగించిన భాష, పదజాలం, డిక్షన్, తప్పితే సీవీ గారు మొట్టమొదటిసారిగా భాషని ప్రజాస్వామీకరించాడు, శూద్రీకరించాడని కూడా నేను చెప్పగలుగుతున్నాను.

---

# విలువైన రచనలు సివి గారివి

◆ సి. హెచ్. శివారెడ్డి



సీవీగారు చెప్పిన దాంట్లో దేవుడు. మన చేతిలో కీలుబొమ్మ. మనం సృష్టించుకున్నాం. మనమే సృష్టించుకున్నాక ఆ దేవుడి చేతిలో ఎలా బంధీలై పోయాం? భారతీయ సంస్కృతి మిగతా సంస్కృతి కంటే భిన్నంగా ఉండటం, నాలుగు కులాలు చతుర్విధ కులాలు, తరువాత ఐదో కులం చేరటం, వాటిల్లో వర్ణాలు, ఇవన్నిటిని కూడా పుట్టు పూర్వోత్తరాల నుంచి అత్యంత ప్రతిభావంతంగా సీవీ గారు మన మనస్సులకు హత్తుకునేట్లుగా రాశారు. ఆ మాటలు కూడా ఎలా వుంటయి అంటే మెల్లగా హృదయంలోకి జొరబడి నాన్‌స్టాప్ గా దూసుకు పోతుంటాయి. ఎక్కడా ఏ రాజీ వుండదు. నరకాలి అనుకున్నారంటే అది గండ్ర గొడ్డలిని తీసుకుని నరికేయడం లాగే వుంటుంది. ఆ చెప్పే విధానంలో కూడా ఏ కొంచెం తొట్రుపాటు కూడా ఉండదు. ఏదీ నూటికి నూరు పాళ్ళు సరైంది కాదు, ఏదీ నూటికి నూరు పాళ్ళు తప్పు కాదని మనం అనుకుంటాం గానీ, సీవీ గారి దృష్టిలో ఏ విషయాన్ని అయినా సరే గతి తార్కిక భావం దృష్టితోనూ, నాస్తిక వాదం, హేతువాదం, చార్వాకం, వీటికి నిలబడకుండా ఏదైనా వుందీ అంటే దాన్ని నిర్దాక్షిణ్యంగా తోసిపుచ్చేయటమే.

ఆయన రచనలు చదివిన తర్వాత ఆడ, మగ, స్త్రీ, పురుషుల సంబంధంలో మగవాడి కులం ఆడదానికెందుకు రావాలి? ఎందుకంటే తల్లి వాస్తవం అయితే, తండ్రి నమ్మకం కదా! ఇది నన్ను గొప్పగా ఆలోచింపచేసింది. మామీద చూపిన ప్రభావం అంతా యింతా కాదు. ప్రచండ హోరులా పనిచేసేది. సీవీ గారి ప్రభావంతోనే మా యింట్లో చాలామందికి నేను శత్రువునయ్యా.

సీవీ గారి రచనలు నేను చదివినవి అవి నా మీద ప్రసరించిన ప్రభావము, నా మనసులో లేక నా బ్రెయిన్‌లో ముద్రించినవి అవి ఈనాటికీ పదిలంగా బీజాక్షరాలలాగా, అంత సజీవంగా, ఇప్పుడు కూడా చైతన్యవంతంగా అంత విప్లవ స్ఫోరకాన్ని కలిగించేటట్లుగా వుంటాయి. వాటిల్లో ఏది చెప్పి మిగతావాటిని చిన్నబుచ్చాలో తెలియక వదిలేసి, వాటి భావాన్ని మాత్రమే నేను చెపుతున్నాను. సీవీగారి ముందే నేను ఇలా మాట్లాడటం ఒక అద్భుతమైన అవకాశంగా ఇది నా జీవితంలో మరిచి పోలేని అనుభూతిగా మిగులుతుంది.

## వారి రచనలు చదవడమే సివికి మనమిచ్చే గౌరవం



సీవీ గారి ఖడ్గసృష్టి కావ్యపరామర్శ రచనకు ఒక పది పేజీలు ముందుమాట రాశాను. అద్భుతమైనటువంటి పుస్తకం ఇది. ఇక్కడెవరో వేదిక మీద అదృష్టం అనే మాట వినపడింది. అదృష్టం, దురదృష్టం అని అనలేకుండా ఉండలేమా? ఐయామ్ హాపీ, ఐయామ్ హియర్ విత్, అలాంగ్ విత్ టుడే. ఈ రోజు నేను మీ మధ్య వుండటం అదృష్టం. అక్కర్లేదు. నిన్న రాలేక పోవడం దురదృష్టం. అక్కర్లేదు. ఐయాం సారీ ఐ కుడ్ నాట్ కమ్ ఎస్టర్ డే అనొచ్చుకదా. అనం. అదువల్ల మన భావజాలం, భాషాజాలం పదాలు కూడా మారాలి. సీవీ గారు రాసేటప్పుడు ఏయే పదాలు వాడకుండా వుంటే మంచిదో లిస్టు కూడా రాసి ఇచ్చాం. చాలా మంది చెప్తుంటారు. ఇందాక దివికుమార్ గారు కోట్ కూడా చేశారు. ఒకటే, వచ్చిన కొద్ది సందర్భంలో మనవి చేసేదేమంటంటే మాకు ఓట్లేస్తే రాముడి సంతానం. ఓట్లేయకపోతే అక్రమ సంతానం. హమే ఓట్ దాలేతో రామ్ జాలే...నైతో హరామ్ జాదే... ఇవీ ఈ దేశంలో మాటలు. వారి రచనలు చదవడమే సీవికి మనమిచ్చే గౌరవం. మనమిచ్చే సత్కారం.

◆ మోతుకూరి నరహరి

## మతోన్మాద భావజాలానికి అడ్డుకట్ట సివి రచనలు



సీవి గారి సింధునాగరికత పుస్తకానికి ముందుమాట రాయడంలో నాకున్న అర్హత ఏమిటంటే సీవీ గారు మొదట మావూరు 1977లో క్లాసులు చెప్పడానికి హాజరయ్యారు. ఈశ్వరప్రభు గారు, రావిపూడి వెంకటాద్రి గారు. ఎండాకాలం నైట్ క్లాస్ చదివే కాలంలో ఇది జరిగింది. నరబలి, సత్యకామ జాబాలి, తదితర పుస్తకాలన్నీ మా గురువుగారు చదివించేవారు. ఇప్పుడు సింధునాగరికత అనేది చాలా అవసరంగా ముందుకు వచ్చింది. లేకపోతే హిందువులే ఈ దేశంలో మొదటి నుంచీ వున్నారనీ, ఇది హిందూ దేశమని, మనకు ఒకటే దేవుడని, ఒకే పద్ధతులున్నయని, చెప్పటానికి ప్రయత్నం జరుగుతా వుంది. భగవద్గీతే మన మత గ్రంథంగా చేయాలని, ఇట్లాంటి ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్న రోజుల్లో హిందూ మతోన్మాదులకు అడ్డంపడే ఏకైక విషయం ఏదైనా వుంటే అది సింధు నాగరికత. విదేశాల నుంచి ఎవరు, ఎప్పుడు వచ్చారు? ఆర్యులా? ద్రావిడులా? అనేటటువంటి విషయాలకు చారిత్రక ఆధారం దొరికింది కాబట్టే మనం దానిపై చర్చ నడిపే పరిస్థితి ఈ సింధు నాగరికత సృష్టించింది. కాబట్టి ఇందులో వుండే ఏడు భాగాల్లో ఆ నాగరికత పుట్టి, పెరిగి, అది పతనమై ఎలా ముందుకు సాగింది. అందులోంచి మనం నేర్చుకోదగిన పాఠాలన్నిటిని కూడా వివరించింది. కాబట్టి దీని అధ్యయనం ద్వారా మనం హిందూ మతోన్మాద శక్తుల్ని ఎదుర్కోడానికి మంచి అవకాశాన్ని సీవీ గారు కల్పించారు.

◆ కారుసాల శ్రీనివాసరావు

***మనవి: 2015 జూన్ 28న విజయవాడ 'వేదిక' లో సివి సమగ్ర రచనలపై జరిగిన సెమినార్ ప్రసంగాలు ప్రస్తావనలతో ఆగస్టు నెల సంచిక అందిస్తున్నాం. స్థలాభావం రీత్యా ప్రసంగాలను స్వల్పంగా ఎడిట్ చేయడం, ప్రస్తావనలు చేసిన వారివి క్లుప్తంగానే ఇవ్వడం అనివార్యమైంది. వారి వారి కోణాల్లో అనేక అంశాలు లేవనెత్తారు. అదే సమయంలో సివి రచనల్లో భాష ప్రస్తావనలకు సంబంధించి వచ్చిన ఒకటి రెండు మినహాయింపులను కూడా మేము ఆమోదిస్తున్నాం. ఏమైనా ఈ సెమినార్ సాహిత్యాభిమానులను సివి రచనలు ఇష్టపడేవారిని గొప్పగా ఉత్సాహ పర్చింది. ఇలాటి మరికొన్ని ప్రయత్నాలకు మార్గం చూపింది. ఇందులో పాలు పంచుకున్న వారందరికీ ధన్యవాదాలు. వెనువెంటనే సంచికగా తీసుకొస్తున్నందున ఏమైనా లోటు పాట్లు వుంటే మన్నించగోర్తాం. - ఎడిటర్***

# ఎన్నికల వ్యవస్థమీద ఎక్కుపెట్టిన కావ్యం అది



నేను ముందు మాట రాసింది విషాద భారతం కావ్యానికి. సీవీ గారిది మొట్టమొదట ప్రచురితమయ్యింది విషాద భారతమే. 1965లో. అంతకుముందు ఆయన చాలా వ్యాసాలు రాసినా అవి పుస్తక రూపంలో రాలేదు. విషాద భారతం ఆయన మొదటి పుస్తకం. ఆయన ఎన్నికల వ్యవస్థమీద ఎక్కుపెట్టిన కావ్యం అది. 'ఆధునిక ప్రజాస్వామ్యం ఒక పొద్దుతిరుగుడు పువ్వు. ఆధునిక ప్రజాస్వామ్యము ఒక సానిదాని నవ్వు. ఆధునిక ప్రజాస్వామ్యమొక ప్రాస్టిట్యూట్. ఓటు దాని గేటుకు చెల్లించే రేటు' అని 50 ఏళ్ళ క్రితం చెప్పారు సీవీ గారు. ఎన్నికల వ్యవస్థ కూడా మన సంస్కృతి మీద ప్రభావం చూపిస్తోంది. మన జీవితం కూడా ఎన్నికల వ్యవస్థ చుట్టూ రకరకాల రూపాలలో తిరుగుతోంది. మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా, పాల్గొన్నా, పాల్గొనకపోయినా, ప్రజల జీవితాల్ని ఎన్నికల వ్యవస్థ ఎంత దిగాజార్చిందీ అనేటటువంటి విషయం ఆనాటికీ, ఈనాటికీ మనం చూసుకుంటూ వెళితే ఇవాళ సాంస్కృతిక పరిణామం ఏమిటీ అంటే ఎన్నికలు అనేటటువంటివి డబ్బు, కులం, మతం, సారా, గూండాయిజం ప్రాతిపదికగా జరుగుతున్నాయి.

◆ దివికుమార్

---

# ప్రత్యామ్నాయ సంస్కృతి కోసం కృషిచేయాలి



సీవీ గారు రాసిన రచనల్లో కావాలి మనకూ ఒక సాంస్కృతిక విప్లవం పుస్తకానికి నేను ముందుమాట రాశాను. అద్భుతమైనటువంటి పుస్తకం.

ఎవరిక్కావాలి సాంస్కృతిక విప్లవం? అని చెబుతూ ఆకలేసి కేకలేస్తున్న ప్రజలకోసం విప్లవాన్ని ఆహ్వానిస్తున్నాను అని ఆయన ప్రారంభిస్తారు. మండుతున్న వర్గ చైతన్యమే మీ చేతిలోని ఆయుధం. అభేద్యమైన మీ ఐకమత్యమే జాతికి గాండీవం. అంచేత రండి... సమస్త మానవుల్లారా రాక్షస సంహారానికి అని 1968 లో రాశారు. 45 సంవత్సరాల క్రితం రాసినటువంటి ఈ పుస్తకంలో ఆయన ఈ సాంస్కృతిక విప్లవం కష్టజీవులకు కావాలి, అన్నార్తులకు కావాలి. శ్రామిక వర్గానికి కావాలి. శ్రామిక కులాలకు కావాలి అని ఆయన ఆకాంక్షించారు.

రాజకీయంగా, ఆర్థికంగా, ఆధిపత్య వర్గాలుగా ఉన్న వారు మాత్రమే సంస్కృతిని ప్రభావితం చేస్తారనేటటువంటిది సాధారణ అభిప్రాయం. కానీ 1940, 50, 60 ఈ దశాబ్దాలలో కమ్యూనిస్టు ఉద్యమం తెలుగునేల మొత్తాన్ని ప్రభావితం చేసి ఆనాడొక నూతన సంస్కృతిని, మాటల్లో చెప్పడం కాదు, పుస్తకాల్లో రాయడం కాదు, ఆచరించింది. ఆ విధంగా వందలు, వేలు కష్టజీవుల నుంచి పునాది వర్గాలనుంచి పెద్దఎత్తున సాధారణ మానవుల్ని నాయకులుగా, కార్యకర్తలుగా తీర్చిదిద్ది ఆ రకంగా సమాజానికి ఎంతో పెద్ద శక్తిని కలిగచేసింది. మొత్తం పాలక వర్గాల భావజాలాన్ని కూడా పక్కకు నెట్టేసి కమ్యూనిస్టు ఉద్యమం ఆ రకమైన పద్ధతిలో ముందుకు నడపగలిగినటువంటి ఉద్దీపనగా పనిచేసినటువంటి పరిస్థితి వున్నది. ఇప్పుడున్నది చాలా చెడ్డ సంస్కృతి. కష్టజీవులకు భిన్నమైన సంస్కృతి, నష్టం జేసేటువంటి సంస్కృతి. ఈ సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడగలమా? సాంస్కృతిక విప్లవాన్ని సాధించగలమా? అవును. సాధించగలం. ఎలా? వారు చెప్పారు. వర్గము, కులమూ మొత్తమంతా కలుపుకోవాలి. కలిపి చూడాలి. ఈ దేశంలో సంక్లిష్టతల దృష్ట్యా అలా చూడాలి. అదే సందర్భంలో వారు చెప్తారు మార్క్స్, అంబేద్కర్ భావజాలాన్ని అవసరమైన పద్ధతుల్లో కలుపుకోవాలి. ఈ క్రమంలో ఇవాళ వామపక్షాలున్నాయి. అభ్యుదయ శక్తులున్నాయి. ప్రజాహిత శక్తులున్నాయి. వాళ్ళంతా చెబుతున్నారు. మేమొక ప్రత్యామ్నాయ సంస్కృతి కోసం నిలబడి వున్నాం. దానికోసం ప్రయత్నం చేస్తాము అని చెప్పి అలాంటి శక్తులు కొన్ని ముందుకు వస్తున్నాయి. అలాంటి శక్తులను బలపర్చడం ద్వారా మనం కూడా ఈ రాష్ట్రంలో మరొక ప్రత్యామ్నాయ సంస్కృతిని చూడ్డానికి అవకాశముంటుందని భావిస్తున్నాను.

◆ వై. సిద్ధయ్య



## క్రాంతదర్శి సివి

నాస్తిక హేతువాద ప్రపంచ మహాసభలు విజయవాడలో జరిగినప్పుడు విద్యార్థులుగా వచ్చి వారి పుస్తకాలు కొనుక్కుని, సభలు విని, ముఖ్యంగా కత్తి పద్మారావుగారు లాంటి వారి ఉపన్యాసాలు విని స్ఫూర్తి పొందిన తరం మాది. నరబలి, సత్యకామ జాబాలి లాంటి ఈ పుస్తకాలు వేము కళాశాలలో ఇంటర్మీడియెట్ చదువుతున్న ప్రాంతంలో చదివి ఉత్తేజం పొందిన వాళ్ళం. ఆ ప్రేరణతోనే ఈ రోజు ఈ సాహిత్యోద్యమంలో కొనసాగుతున్నాం. హేతువాద దృక్పథాన్ని, సమాజాన్ని, సంఘటనల్ని, లేదా శాస్త్రాలని ఏ విధంగా చూడాలి, అర్థం చేసుకోవాలి? ఏ రకంగా అర్థం చేసుకుంటే అవి శాస్త్రీయంగా ఉంటాయనేది సీవీ గారి రచనల ద్వారానే తెలుసుకున్నాం. ఒక తాత్విక దృక్పథాన్ని ఈ ప్రపంచాన్ని, సాహిత్యాన్ని, చరిత్రను అర్థం చేసుకోడానికి సీవీ రచనలు మాకు విద్యార్థి దశలో చాలా ప్రేరణనిచ్చాయి.

1930లో వచ్చినటువంటి ఆర్థిక మాంద్యం మళ్ళీ రాబోతోంది. రావచ్చు అని ఆర్‌బిఐ గవర్నరు ఇటీవల ఒక ప్రకటన చేశారు. నిజంగా శ్రీశ్రీ గారి కవిత్వం కూడా 30 లోనే వచ్చింది. ఈ సభ చూస్తే నిజంగా ఇన్ని సంస్థలు కలిసి సీవీ గారి రచనల మీద సమాలోచనలు చేయడం చూస్తే మన తెలుగు నేలపైన రాబోతున్నటువంటి ఆర్థికపరమైన సంక్షోభం నేపథ్యంలో అందరం కలిసి, అన్ని ఆలోచనలూ కలిపి ఒక అభ్యుదయ ప్రగతి శీల సాంస్కృతిక మహోద్యమం రాబోతుందనిపిస్తుంది. ఈ ప్రతీఘాతుక సాంస్కృతిక దాడి నుండి రక్షించుకోవడానికి ఇదొక ప్రాతిపదిక అవుతుంది.

వ్యక్తులు చాలా మంది వున్నారు. చాలామంది వ్యక్తుల గురించి మాట్లాడుతాం. ఎవరు ఏ వ్యక్తి స్ఫూర్తి దాతగా, ప్రేరణ ఇచ్చేవాడుగా, భవిష్యత్ తరాలకు కూడా ఒక ఆలోచనను కొనసాగించేవాడుగా మిగులుతాడు అంటే అది సమాజం గురించి ఆలోచించిన వాళ్ళు. సమాజం గురించి శాస్త్రీయంగా ఆలోచన చేసి, భవిష్యత్తరాలకు ఒక క్రాంతదర్శులుగా మిగిలినటువంటి వాళ్ళే మిగులుతారు. అట్లా మనకు మిగిలిన వాడూ, అట్లా ఆలోచించినటువంటి వాడు సివి.

◆ **కె. ఆనందాచారి**



## సాంస్కృతిక సైనికుడు సివి

సీవీగారు రాసినటువంటి పుస్తకాలనన్నింటిని తిరిగి ప్రచురించి, ప్రజలలోకి తీసుకురావడం ఒక మహత్తరమైనటువంటి విషయం. ఎందుకంటే, యిప్పుడు యింతకుముందుకంటే కూడా సాంస్కృతికమైనటువంటి ప్రత్యామ్నాయాన్ని నిర్మించడానికి అవసరమైనటువంటి సమయమిది.

సీవీ రచనలకు చాలా చారిత్రక ప్రాధాన్యత వుంది. ఈ ప్రత్యామ్నాయ సంస్కృతి గురించి 40 ఏళ్ళ కిందట ఆయన రాసినప్పటికి కూడా ఆయన వేసినటువంటి బాటను సాహితీ లోకం విరివిగా అందుకోలేదని అనిపిస్తుంది నాకు. అందుకోలేక సాహితీ సంస్కృతి ప్రత్యామ్నాయంలో వెనుకబడి వున్నామని అనిపిస్తున్నది. సీవీ గారు తను రాసిన కావ్యాలను ఏ లక్ష్యంతో రాస్తున్నాడు? రచయిత రాసే పుస్తకాన్ని తాను ఏ లక్ష్యంతో రాస్తున్నాడో ఆ లక్ష్యానికి ఏ విధమైనటువంటివి అవసరమో, ఏ విధమైనటువంటి నిర్మాణమవసరమో, ఆ విధంగా రాస్తాడు. అంతేగాని, కావ్య మర్మాలు, కావ్య శిల్పాలు గురించి రాయడు. ప్రజలకు విషయపరంగా పరిజ్ఞానం కల్పించడం కోసమే తన కలాన్ని నడిపించి సాంస్కృతిక సైనికుడుగా, సాంస్కృతిక సేనాధిపతిగా సివి పనిచేశాడు. నరబలి కావ్యంలో ఆయన ముగింపులో పోరాటమెప్పుడూ ఒకసారి ఓడిపోయినా కూడా అది ఆగదు. పోరాటం ఎప్పుడూ ఎదుగుతూనే వుంటుంది. జెండా ఎగరేస్తూనే వుంటుంది అని భరత వాక్యంలో చెప్పి ఈ సాంస్కృతిక ప్రత్యామ్నాయ పోరాటం జరుగుతూనే వుంటుందనే సందేశాన్ని యిచ్చినటువంటి వ్యక్తి సీవీ గారు. ఆయన చూపినటువంటి బాటను ఈనాడు, మన ఎన్నో అస్తిత్వ ఉద్యమాల నడుమ అనేక విభిన్న పోరాటాల నడుమ వీటినన్నిటిని హేతువాద, నాస్తిక ఉద్యమాలను ఏకోన్ముఖంగా చేసుకుని ఈనాడు సమాజాని కెదురయినటువంటి హిందూ మతోన్మాద ఫాసిస్టు శక్తులకి ఎదురొడ్డి నిజమైన సమాజాన్ని నిర్మించాల్సినటువంటి అవసరం వుంది. ఆ అవసరాన్నినిక్కచ్చిగా సీవీ రచనలు తేల్చి చెప్పినయ్.

◆ **వల్లభాపురం జనార్దన**

# సివి రచనలు విస్తృతంగా ప్రజల్లోకి తీసుకెళ్ళాలి




**స్టూ**డెంట్‌గా నేను సీవీ గారి రచనలు రెండే చదివాను. అది కూడా నాస్తికవాదం మీద రంగనాయకమ్మ కరస్పాండెన్స్ దాన్ని మాత్రమే చదివాను. అయితే ప్రజాశక్తి బుక్‌హౌస్ ఎడిటర్ అయింతర్వాత, నాకొక మంచి అనుభవం వచ్చింది. సీవీ గారిని కలుసుకుని మీ పుస్తకాలంతా మేము వేద్దామనుకుంటున్నామండి అని అడిగా. అప్పటికి నేనింకా అన్ని పుస్తకాలు చదవలేదు. అయినా కూడా ప్రోగ్రెసివ్ రైటర్‌గా ఆయనకున్న పేరువల్ల మేము వెళ్ళి అడిగాం. మాకు అవకాశం ఇచ్చారాయన. కాబట్టి మేము ఈ బుక్స్ అన్నీ వేయగలిగాము.వేసిం తర్వాత, వేసే క్రమంలో నేను ఆయన పుస్తకాలన్నీ చదివాను. ఇవి చదువుతున్నప్పుడు సామాజిక అంశాలు, సాంస్కృతిక అంశాలు, ఆర్థిక రాజకీయ అంశాలు, తాత్విక అంశాలు ఈ రచనల నిండా కనిపించాయి. ఈ రకంగా కనిపించడం వల్ల ఈ పుస్తకాలను అచ్చువేయడమే కాదు, వీటిని ప్రజల్లోకి చాలా విస్తృతంగా తీసుకువెళ్ళడం వల్ల సమాజానికి చాలా ఉపయోగపడుతుందని భావించాము. సివి గారి పుస్తకం ఊళ్ళోకి స్వాముల వారు వేంచేశారు చదివి నాకు చాలా ఉత్సాహమేసింది. ఇన్ని రోజుల తర్వాత కూడా, 40 ఏళ్ళ కిందట రాసిన పుస్తకం ఎంత రెలవెంట్. స్వామివార్లు చేస్తున్న అకృత్యాలు బయటపడుతున్నాగానీ, మళ్ళీ వారు ఏ మాత్రం మొహమాట పడకుండా, బాధపడకుండా, మళ్ళీ గుళ్ళు కట్టించుకుంటున్నారు, మళ్ళీ పూజలు చేయించుకుంటున్నారు. ఒక గుడి కట్టడానికి 500 కోట్లు అలాట్‌మెంట్. తిరుపతి దేవుడి ని రక్షించడానికి, అది ఒక వ్యాపార సంస్థగా చూడబట్టి, వీళ్ళు ఈ నమ్మకాలన్నిటిని రోజురోజుకూ పెంచి పోషిస్తున్నారు. లేనివి ఉన్నట్లు ప్రచారం చేయడానికి వాళ్ళు అంత శ్రమతీసుకుంటే, ఉన్నవి ఉన్నట్లు తెలుసుకోవడానికి, ప్రచారం చేసుకోవడానికి చేస్తున్న ఈ ప్రచారం, తప్పుని చెప్పడానికి మనమింక ఎంత కన్విన్షన్‌తో, ఎంత నమ్మకంతో , ఎంత పట్టుదలతో ముందుకెళ్ళాలి. ఆ వుద్దేశం తోనే మేమీ సెమినార్స్ నిర్వహించాము. ఈ ఆలోచనలు ఉన్న అందరినీ కలుపుకొని నిర్వహణ కమిటీగా ఏర్పడి చేస్తున్నాము. కాబట్టి మాతో సహకరించి రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో ఈ సెమినార్లు పెట్టి మనందరము, మన ఆలోచనలను ప్రజల్లోకి తీసుకువెళ్ళి, ఈ మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా పోట్లాడి, ప్రజలందరినీ చైతన్యవంతులను చేసి, సీవీగారి ఆశయాల్ని ముందుకు తీసుకువెళ్ళాలి.

◆ కె. ఉషారాణి

# సివి రచనలు శాస్త్రీయ అవగాహనను పెంపొందిస్తాయి

**వా**స్తవానికి నేను నరబలి, సత్యకామజాబాలి మాత్రమే చదివాను. నేను సైన్స్ రచనలు చేయబట్టేమో ఈ డార్విన్ పరిణామ వాదానికి ముందుమాట రాయమన్నారు నిర్వాహకులు. అందుకని ఇది చదివాను. సివి మత గ్రంథాలు, హిందూ గ్రంథాలు చాలా చదివారు. అందులో ఉండే కాంట్రిడిక్షన్స్ అన్నీ తీసుకొచ్చి ఇందులో కోట్ చేశారు. చార్లెస్ డార్విన్ గ్రంథాన్ని తీసుకుని ఆయన ఒక శాస్త్రీయ దృక్పథాన్ని చెప్పడానికి ప్రయత్నం చేశాడు. అయితే డార్విన్ పుస్తకాన్ని చదవడానికి అలవాటు పడ్డవారు ఈ పుస్తకాన్ని చదివితే నిరుత్సాహపడతారు. కాని డార్విన్ సిద్ధాంతం ద్వారా మానవుడి ఆవిర్భావం ఎలా జరిగింది? జీవుల ఆవిర్భావం ఎలా జరిగింది? ఆ విషయాన్ని తెలుసుకోవడానికి ఈ గ్రంథం చాలా ఉపయోగపడుతుంది. అందులోనూ ఈ రోజుల్లో ముఖ్యంగా ప్రధాన మంత్రి స్థానంలో వుండే వ్యక్తి వినాయకుడికి ఏనుగు తలను పెట్టి ప్లాస్టిక్ సర్జరీ చేశారనీ, అటువంటి టెక్నాలజీ ఆ రోజుల్లోనే వుందని చెబుతూ వుంటే – అంటే మనిషిని, ఏనుగునూ రెండు జాతులను తీసుకొచ్చి కలిపేశారు. రెండు జాతుల జీవిని, ఒకదానికొకటి సంబంధం లేని జీవిని కలిపేసేసి అతికించే టెక్నాలజీ ఆ రోజుల్లో ఉందని. విమానాలు ఆ రోజుల్లో ఎగురుతున్నాయని. ఇటువంటి ఒక అసంగతమైనటువంటి, అశాస్త్రీయ మైనటువంటి విషయాలన్నిటిని ప్రధాన మంత్రితో సహా, మంత్రులందరూ, ఎంపీలు, ఎమ్మెల్యేలు పని గట్టుకుని ప్రచారం చేస్తున్నటువంటి ఈ సమయంలో సీవీ రచనల్లో ఈ డార్విన్ పరిణామ వాదం చాలా సింపుల్‌గా, ఈ మతాల్లో చెప్పేటటువంటి అసంగతమైన విషయాలన్నిటిని ప్రజల్లోకి తీసుకువెళ్ళడానికి అద్భుతమైన టానిక్ ఇది. వాళ్ళు చేసే ప్రచారానికి ఇది కౌంటర్ బాణం. మంచి బాణం. అందువల్ల ఇది ప్రజల్లోకి తీసుకెళ్ళడం మనందరి కర్తవ్యం. పామరులకు కూడా మానవుడెక్కడినుంచి వచ్చాడో చెప్పడానికి ఉపయోగపడే ఈ గ్రంథాన్ని ప్రజల్లోకి తీసుకెళ్ళాల్సిన అవసరం వుందని నేను భావిస్తున్నాను.



◆ ఎస్. వెంకట్రావు

# సాంస్కృతిక ఉద్యమానికి దిక్సూచి సివి రచనలు



సీవీ గారి ఈ పుస్తకాల్లో మహామనిషి హోచిమన్ పుస్తకానికి ముందుమాట రాయమని అడిగారు నన్ను. అది మరో గర్వకారణం. ఒకటి ఆయన పుస్తకానికి నేను ముందుమాట రాసే స్థాయికి నేను ఎదగడం. రెండోది నాకు చాలా చాలా ఇష్టమైన కమ్యూనిస్ట్ నాయకుడు మహామనిషి హోచిమన్. అందుకని ఆ బుక్‌కి నేను ముందుమాట రాయడం. అది రాసే క్రమంలో ఎక్కడో వియత్నాం, అక్కడి సాంప్రదాయాలు వేరు, ఇక్కడి సాంప్రదాయాలు వేరు. అయినా హోచిమన్ మనవాడేనా, మన మధ్య పుట్టి పెరిగిన వాడేనా, మనకోసం పనిచేసిన వాడేనా? అన్నంత స్ఫూర్తి, ఆర్తి వచ్చే పద్ధతుల్లో సరళంగా ఉండే భాష, ఆ భాష మీద పట్టు మాత్రమే కాదు. మనసు పొరల్లో ఎక్కడో సామ్రాజ్యవాద వ్యతిరేకత, వర్గ దోపిడీకి వ్యతిరేకత ఉంటేనే అంత సరళంగా, అంత లోతైన భాష, పదాలు ఎటువంటి వాళ్ళకైనా అర్థమయ్యేటట్లు సాగిపోయేటట్లు వస్తదన్నమాట. అందుకని బహుశా ఇది సీవీ గారికి తప్ప ఇతరులకు సాధ్యమా అన్నట్లుగా అది చదివేటప్పుడు మాత్రం నాకనిపించింది. ఒక భావ విప్లవానికి, సాంస్కృతిక ఉద్యమానికి ఒక దిక్సూచీ సీవీ గారి రచనలు.

◆ పుణ్యవతి

# సాంస్కృతిక ఉద్యమం అవసరం




సీవి గారి మధ్యయుగాల్లో కుల వ్యవస్థ అనే పుస్తకంలో ఒక వెయ్యి సంవత్సరాల కాలాన్ని వివరించారు. దీంట్లో ప్రధానంగా నేను గమనించిందేమిటంటే, భారత సమాజంలో వర్ణవ్యవస్థ కుల వ్యవస్థగా ఎలా మారింది? ఆ మారే దశలో జరిగిన పరిణామాన్ని ఈ పుస్తకంలో పూర్తిగా వివరించడం జరిగింది. భారత సమాజం, మిగతా సమాజాల తోటి పోల్చుకుంటే, విలక్షణంగా వున్న విషయం మనకు తెలిసిందే. ఆదిమ సమాజంలోపల ఆదిమ సమాజం, గణ సమాజం, వర్ణ సమాజం, కుల సమాజం, కుల వర్గ సమాజంగా పరిణామం జరిగింది. ఈ వాస్తవాలని అర్థం చేసుకోవడానికి ఇప్పుడు, అనేకమంది సామాజిక శాస్త్రవేత్తలు ఈ కోణం నుండే భారత చరిత్రనంతా పరిశీలిస్తున్నారు. దానికి ఉపయోగపడేలాగా ఈ పుస్తకం వున్నది.అలాగే కులం ఎక్కడుంది. పునాదిలో వుందా? ఉపరితలంలో వుందా? అని చర్చోపచర్చలు జరుగుతున్నయ్. కులం అనేది భారత సమాజంలోపల అది పునాదిలోనే వుంది. ఇప్పటికీ అది పునాదిలో భాగంగానే వుంది. ఫ్యూడలిజం వున్నంతవరకు, లేక రెండొందల సంవత్సరాల దాకా కులం వర్గం ఒకటిగానే వుంది. కుల సమాజానికి వ్యతిరేకంగా పోరాటం చేయకుండా, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాటం చేయకుండా, కులాన్ని బలహీన పర్చకుండా, వర్గ ఐక్యత కూడా సాధ్యం కాదు. వర్గ ఐక్యత కావాలంటే కులాన్ని బలహీన పర్చాలి. వర్గ ఐక్యత మేరకయినా కులాన్ని బలహీన పర్చాల్సుంటది. కులం బలహీన పడాలన్నా వర్గ పోరాటాలు జరగాలి. ఈ అవగాహనను మరింత ముందుకు తీసుకుపోవాల్సిన అవసరముంటది.

బతకమ్మ సమాజ సంస్కృతిలో ఒక భాగం. అది అంతకుముందు రొటీన్‌గా జరిగేది. దాంట్లో ఒక మార్పు తేవడానికి ప్రయత్నం చేశాం. ఆడపిల్లని పుట్టనిద్దాం. ఆడపిల్లని బతకనిద్దాం, ఆడపిల్లని చదవనిద్దాం, ఆడపిల్లని ఎదగనిద్దాం అన్నాం. అంతకు ముందు జనరల్‌గా ఆడపిల్లల పండగగా జరుగుతున్న పరిస్థితి. అంటే ఈ విధంగా సావిత్రీ బాయి పూలే జయంతిని, ఉపాధ్యాయుల దినంగా ప్రకటించాలె అని ఒక డిమాండు పెట్టాం. ఇదంతా కూడా సీవీ గారి రచనల నుండి ప్రభావితం పొందిన ఫలితమే. కాబట్టి వారి రచనలన్నీ రోజురోజు ఇంకా ముందుకు పోతై. ఇంకా అనేక రకాలుగా విస్తరిస్తయ్. అది చూసి 40, 50 సంవత్సరాల క్రితం ఇంత కృషి చేసినందుకు వారిని అభినందిస్తున్నాను.

◆ జి. రాములు

# బహు రూపాల్లో సాంస్కృతిక చైతన్యం




◆ తెలకపల్లి రవి

కంచె అయిలయ్య గారన్నది నిజమే...తన కాలానికి బుద్ధుడు అత్యధికమైన వాస్తవికతకు దగ్గరగా వచ్చాడు. అంతకుమించి ఇంకొక్క అడుగు వేయాలంటే శాస్త్రీయ సోషలిజానికి వెళ్ళాలి. ఆ కాలానికది సాధ్యం కాదని దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ ఒక మాట అన్నారు. అయితే బౌద్ధంలోనూ అహింస శృతి మించిన తరువాత మళ్ళీ అది ఉత్పత్తికి ఏమవుతుందనే చర్చ కూడా ఆనాడు వచ్చింది. సీవీ గారు తన ఒక రచనను చీకటి వెలుగుల్లో తనతో పయనిస్తున్న భారతికి అంకితమిచ్చారు. ఇంతకాలం ఇన్ని రచనలు చేస్తూ, తన రచనలు బయటికి రావడానికి భారతి గారు, వారి కుటుంబ సభ్యులు కూడా చాలా గొప్ప సహకారం అందించి వుండాలి. ఆశయ ధనులైన వారికి తోడు నిలిచే కుటుంబాలు తగ్గిపోతున్నటువంటి లేదా పెరుగుతున్న చోట పెరుగుతుండొచ్చు కూడా. మా నాన్న తర్వాత ఆయన పుస్తకాలు అక్కరలేదు, తీసుకుపోండి అనే వారు ఎక్కువమంది కనిపిస్తుంటారు. ఆ కుటుంబ సభ్యులను కూడా నేను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. ఇప్పుడు కంచె అయిలయ్య గారు కమ్యూనలిజం దానిపై పోరాడాల్సిన అవసరంతో పాటు కమ్యూనిస్టులు చేయవల్సిన అంతరావలోకనం చెప్పారు. మన ఇతివృత్తం సాంస్కృతిక వుద్యమం కాబట్టి, సాంస్కృతిక వుద్యమం అనేక రూపాల్లో, అనేక అంశాలతో ముడిపడి వుంటుంది. తెలుగునాట రామస్వామి చౌదరి దగ్గర నుండి ఇప్పుడు మనం చూస్తున్న గ్లోబల్ మోడ్ వరకు అనేక సాంస్క ృతిక పరిణామాలు నడుస్తున్నవి. సీవీ రచనల నేపథ్యంలో ఇవన్నీ మనం ఎలా అర్థం చేసుకోవాలన్నది చర్చించాలి.

.....

నరహరి గారు గుర్తు చేసినట్టు హరామ్ జాదేకో హరానా హమారా ఫర్జ్ హై . ఈ హరామ్ జాదేలను తరిమికొట్టడం మన కర్తవ్యంగా భావించాల్సి వుంటుంది. ఇంకోమాట ఇది విశాల వేదిక. ఖాదర్ మొయినుద్దీన్ ఆంధ్రజ్యోతిలో ఇంటర్వ్యూ చేశారు. విరసం మొదటి సభకు సీవీ గారు వెళ్ళారా లేదా అని వివరిస్తూ వారు వెళ్ళారు,సుందరయ్యపై విమర్శలు వస్తే వ్యతిరేకంగా వాదించి వచ్చేశారు అని చెప్పారు. విరసం సభలకు చాలామంది వెళ్ళారు. ఇక్కడున్న వాళ్ళలో కూడా చాలా మంది వెళ్ళి వుండొచ్చు. అవన్నీ అప్రస్తుతం. అభ్యంతరం కూడా లేదు. మనం ఇతర సమస్యల గురించి ఆలోచిస్తున్నాం .ఆ సందర్భంలో ఏం జరిగింది? అలాంటి ఆలోచనలు యిప్పుడిక్కడ లేవు. వారు చెప్పినట్లుగా ప్రగతి నిరోధకులను యిప్పుడు ఎలా హరానా అనేది ఇప్పుడు మనముందున్నటువంటి ఏకైక కర్తవ్యమని చెప్పి నేను మనవి చేస్తున్నాను.

.....

మనిషి కేంద్రంగా వుండాలి, యంత్రం కేంద్రంగా వుండకూడదు. పెట్టుబడి కేంద్రంగా వుండకూడదు. ఇదే కోణంలో మతం కేంద్రంగా దేవుడు కేంద్రంగా వుండకూడదు. ఐరోపాలో వచ్చిన పునర్ వికాస ఉద్యమానికి, సంఘ సంస్కరణ భావాలకు మూలం ఎక్కడ అంటే మనిషి కేంద్రంగా ఉండాలి, మనిషి యొక్క ఆలోచన కేంద్రంగా వుండాలి. మొదట మార్టిన్ లూథర్ కింగ్ నుంచి వచ్చినటువంటి ఈ పరంపర. ఇప్పుడు మనిషి కేంద్రంగా వున్నాడా అంటే ఇప్పుడు మార్కెట్ కేంద్రంగా వుంది. గాడ్ మార్కెట్ అనే పుస్తకం కూడా వచ్చింది. మీరు చూసుండవచ్చు. మొన్న చంద్రబాబునాయుడుతో




మీకు ఈ మధ్య నమ్మకాలు పెరిగిపోతున్నాయంటున్నారు. అంటే మీరే చెప్పాలి అని చెప్పి ఆ తర్వాత ఆయన దేవుడ్ని కూడా మార్కెట్‌కు ఎలా వాడుకోవచ్చో చెప్పుకొచ్చారు. తిరుపతి మార్కెట్ ఇంత వచ్చిందండీ, శ్రీకాళహస్తి మార్కెట్ ఇంకా అంత రాలేదు. నేను లెక్కేశాను. దాన్ని ఇంత డెవలప్ చేయడానికి అవకాశం వుంది. అదే మీరిదంతా చూస్తే మంగళగిరి దగ్గర కూడా రాజధాని ఇదంటూ వచ్చిన తర్వాత ఇంకా మార్కెట్ రావడానికి అవకాశం వుంది. ఆయన దగ్గర ఖచ్చితమైన లెక్కలు వున్నాయి. ఇదివరకే బిర్లా, టాటాలకు ఈ విషయం తెలుసు. ఎక్కడికెళ్ళావంటే మనం ఏమంటాం? బిర్లా మందిర్‌కు వెళ్ళామంటాం. అక్కడ దేవుడెవరనేది అప్రస్తుతం. వేల కోట్లు సంపాదించినటువంటి బిర్లాలు కూడా అన్ని చోట్లా దేవాలయాలు కట్టించి నాయనా! డబ్బనేది మిథ్య, సంపద అనేది మిథ్య. మీరందరూ ఇక్కడికి వచ్చి ఆధ్యాత్మిక చింతన చేసుకుని పొద్దున్నే మాకు వెట్టిచాకిరి చేయండి. మీ జీవితాలు బాగుంటాయి అని చెప్తుంటారు. కాబట్టి ఈ దైవ భావన అనేది వేర్వేరు యుగాల్లో, ఏ విధంగా ఎవరికి ఉపయోగపడుతుంది పరిశీలించాలి.

.....

మట్టికుండలో పుట్టితివి కదా! నీది ఏ కులము? నాతో చెప్పింతువేమయ్యా అని పెద్ద పరంపర చెబుతాడు గదా! సమయ సమయాలను బట్టి, క్షేత్ర బీజ ప్రాధాన్యతలను నిర్ణయించుచూ కురువంశము ఎన్నడో బలహీనమైనది అని దానవీరశూర కర్ణ డైలాగులు. ఇదంతా విన్నాక నేను సీవీ గారిని అడిగాను. ఇవన్నీ మీ పుస్తకంలోవిగా అనిపిస్తాయే అని. పూర్వాశ్రమంలో కొండవీటి కవిగారికి మనకు స్నేహసంబంధం వుండుంటుంది కదా. అందుకనే ఉపయోగించివుంటారు. అప్పుడప్పుడు నేను వాడుతుంటాను అని చెప్పారని సీవీ గారు అన్నారు. దానవీర శూర కర్ణ సంభాషణలు రాసింది కొండవీటి వెంకటకవి, సీవీ గారికి మంచి మిత్రులు. తరువాత హేతువాద భావాలు ఇవన్నీ కూడా వున్నవారు.

.....

భాష అనేది ఒక క్రమంలో ఏర్పడుతుంది. అదృష్టము అంటే కనిపించనిది. అ దృష్టము - కారణము తెలియనిది. అదృష్టమనేది వేరే ఏదో మహత్యమని, అన్నిటికి కూడా మహత్యాలు ఆపాదించబడ్డయి. అందులో భాగంగా వేషభాషలకు కూడా మహత్యాలు ఆపాదించబడ్డయి. చొక్కా వేసుకోవాలా, వేసుకోవద్దా, నామాలు, ఆఖరికి తిరుపతిలోని ఏనుగుకు రెండు నామాలు పెట్టాలా, మూడు నామాలు పెట్టాలా అనే విషయంపై సుప్రీంకోర్టుకు వెళ్ళి తీర్పు తెచ్చుకున్నారన్న విషయం గుర్తు పెట్టుకోవాలి. అక్కడ వెయ్యి కాళ్ళ మండపం వుండాలా? వద్దా? అనే విషయం మీద స్వాములు కొట్లాడుకున్నారు అన్న విషయం మనం గుర్తు పెట్టుకోవాలి. సినిమా తారలలాగా, ఈ స్వాములందరూ ఫైవ్ స్టార్ కటౌట్లు, ఫ్లెక్సీలతో వెలుగొందుతున్నారన్న విషయం మనం గుర్తు పెట్టుకోవాలి. కాబట్టి ఇవన్నీ కూడా అదృష్టం అనే కారణాలు వాటివెనుక వున్నయ్. అ-దృష్టము, దుర-దృష్టము. తెలియని చెడ్డ కారణం, తెలిసి తెలియని కారణం. మంచి దుర్ముహూర్తం చూసుకుని మొదలు పెట్టాలి మనమేదైనా. ఒకాయనున్నాడు. ఈ రాష్ట్ర ప్రభుత్వానికి ఆయన జ్యోతిష్య సలహాదారుడు. మోడీగారి ప్రమాణ స్వీకారం తప్పుందండి. ఆయనకు చెడు జరుగుతుంది.

ఎవరన్నా తెలిసిన వాళ్ళుంటే నేను చెప్తాను అంటాడు. అయ్యా ఆయన చుట్టూ పెద్ద సైన్యం వుంది. నువ్వు చెప్పక్కర్లేదయ్యా అంటే ఇక్కడ ఈయన్ను ప్రమోట్ చేసుకోవాలి. అక్కడ మోడీ లేదు, ఇంకెవరూ లేదు. పొద్దున్నే చెప్తూ వుంటారు గెలిస్తే నా మాయ, ఓడిపోతే నీ ఖర్మ. ఈ కర్మ సిద్ధాంతంలో అర్థం ఇదేగదా! వీరేగదా! అప్పుడు కూడా ముహూర్తం పెట్టాడు. కాబట్టి తుమ్మితే మనం కూడా తథాస్తు. అనుకోవాల్సిందే.

.....

వీరేశలింగం స్వీయచరిత్ర చదివితే ఆయన వాస్తు ప్రకారం అరటి రెండు గెలలేస్తే కీడు. కొట్టేయమని అందరూ చెప్తే ఆయన కొట్టేయలేదు. మిత్రులారా! ఒక దిగ్భ్రాంతి కరమైన విషయం చెబుతాను నేను. గురజాడ అప్పారావు గారి నివాసాన్ని ఈ మధ్య ప్రభుత్వం తీసుకుంది. ఆయన బావిని తప్పుగా తవ్వించాడు. వాస్తును ధిక్కరించి వ్యతిరేక దిశలో తవ్వించాడు. ఇప్పుడు ప్రభుత్వం ఆ భవనాన్ని తీసుకున్నాక వాస్తు నివారణ చేయాలని కొంతమంది మహానుభావులు అక్కడ ప్రతిపాదిస్తున్నారు. అంటే కాలం వెనక్కు నడుస్తుందా? ఇవన్నీ వాస్తవాలు, కొంచెం కూడా నేను కల్పన ఇక్కడ చేయడం లేదు.

.....

వ్యవస్థలో ఈ మార్పులన్నిటిని ఏక మొత్తంగా, ఏక దృష్టితో చూడగలిగి నటువంటి ఒక దృక్పథం. బహుశా ఉదయం నుంచి మనం చేస్తున్న చర్చనిపుడు ముగింపులో చెప్పుకోవాలంటే, అటువంటి ఒక దృక్పథం వున్నందువల్లే సీవీ గారు అన్ని రచనలు చేయగలిగారు. వాటితో ఇంతమందిని ఉత్తేజపరిచారనే మనం అనుకోవచ్చు. దీనికి ఆయన సిద్ధాంత నిబద్ధతే కారణం. సిద్ధాంతాలు ఆటంకాలు అని కొందరంటుంటారు. ఇవన్నీ అర్థం లేని మాటలు. వాళ్ళు ఆ మనుషులు ఎందుకయ్యారంటే వాళ్ళు ఆ సిద్ధాంతాలను అనుసరించబట్టే. ఉప్పు చాలా రుచిగా వుంటుంది కానీ ఉప్పగా వుండకుంటే బాగుంటుంది. ఉప్పు ఉప్పగా ఉన్నందుకు ఉప్పు. కోయిల పాడినందుకే కోయిల. ఒక సిద్ధాంతం, ఒక ఆచరణ వుండబట్టే ఆ మనుషులు ఆ మనుషులవుతారు. ఆ మహాకవులు మహా రచయితలవుతారనే...స్పృహ చాలామందికి వుండదు.

.....

ఈ మధ్యే భారతం మీద ఒక పుస్తకం వచ్చింది. విమర్శకుడుగా, మీడియా వ్యక్తిగా మాట్లాడ్డం నాకేం అభ్యంతరం లేదు. రంగనాయకమ్మ గారు మహాభారతం మీద రాశారు. దానికి ఆధారంగా ఆమె తీసుకున్న గ్రంథం ఏమిటంటే భారతమే. ఆఖరికి నన్నయ భారతం కూడా కవిత్రయం రాసిన భారతం కూడా ఆధార గ్రంథంగా చూపించారు. నా కాశ్చర్యమేసింది. అసలు రాసేదే మహాభారతం మీద. ఆధార గ్రంథం ఎట్లా అవుతుంది? మహాభారతాన్ని అధ్యయనం చేసిన పుస్తకాలు వున్నాయి. కొశాంబి ఏం చెప్పారు? ఆర్.ఎస్. శర్మ ఏం చెప్పాడు? రొమిల్లా థాపర్ ఏం చెప్పింది? ఇవన్నీ గనక చదివి, మనం అన్వయిస్తే అప్పుడు మహాభారతం ఒక చారిత్రక దృష్టితో చూడగలం. ఒక గ్రంథాన్ని గ్రంథంగా చెప్పడం ఒక వేరు. కానీ పూర్వాపరాలతో చూడటం గతి, తార్కిక, చారిత్రిక భౌతిక వాదం. లేకపోతే గతి తప్పే, కొన్ని సందర్భాల్లో మతి తప్పే ప్రమాదం కూడా వుంటుంది .గతి తర్కం కావాలి తప్ప అతి తర్కం అవసరం లేదు అని చెబుతుంటాను. కాబట్టి ప్రాచీన గ్రంథాలు మనం సమీక్షలు, విమర్శలు చేసేటప్పుడు, కొలబద్ధలుండాలి. రామాయణం గురించి ఇప్పుడు చాలా చర్చ జరుగుతోంది. అసలు రామాయణం నిజమా? కాదా? అంటే శృంగవంశపు కాలంలో అప్పుడున్న రాజులు అతన్ని సంతృప్తి పరచడానికి అతన్నే రాముడిగా పెట్టి రాసినటువంటి ఒక కావ్యమని సీవీ రాహుల్ సాంకృత్యాయన్‌ను ఉటంకిస్తూ చాలా స్పష్టంగా చెప్పారు. దాని ప్రకారం బయలుదేరితే లంక అంటే ఎక్కడుంది? సింహళంలోనా? భద్రాచలంలో పర్ణశాల ఎట్లా వుంది? హేతువాద దృక్పథంతో ఆలోచిస్తే ఎక్కడ ఉత్తరభారతం, ఎక్కడ దక్షిణ భారతం. గురజాడ అప్పారావు గారు ఒక మాట చెప్పారు. ఈ దేశంలో రాముల వారు నివసించని గుహలు, సీతమ్మవారు స్నానం చేయని కొలనులు లేవు పొమ్మన్నాడు. ఎక్కడికి పోయినా కానీ ఇక్కడ చీరలు ఆరేశారు, అక్కడ దేవుడి కాలి అడుగులు పడ్డాయి అని ఇవన్నీ చెబుతూ వుంటారు. కాబట్టి హేతువును ఉపయోగించాలి. రాముడు, రావణుల్లో ఎవరు గొప్పా? రాముళ్ళుగా కొంతమంది చేశారు, రావణుల్లుగా కొంతమంది చేశారు. ఇవన్నీ పాలకవర్గాల లీలలే అన్నటువంటి మార్క్సిస్టు దృక్పథాన్ని, అదే ఎన్టీ రామారావు గారి సినిమా తీశారనుకోండి సమస్యలేదు. ఆయన రాముడేస్తే రాముడు హీరో. ఆయన రావణుడేస్తే రావణుడే హీరో. ఆయన కృష్ణుడేస్తే కృష్ణుడే హీరో, దుర్యోధనుడేస్తే దుర్యోధనుడే హీరో.

అయిదూ ఆయనేస్తే అయిదుగురూ హీరోలే.

చరిత్ర అనేది మనకు నచ్చినట్టుగా వుండదు. చరిత్రగానీ, పురాణంగానీ ఒక మార్క్సిస్టు దృష్టితో చదవాలి. సీవీ. విషాద భారతం కేరళ నేపథ్యంలో రాశారు. నంబూద్రిపాద్ పాలనను కూలదోయడం, ఆ కుట్ర అది..కాళియై, ప్రళయాగ్ని కీలయై అన్నది పశ్చిమ బెంగాల్‌లో జరుగుతున్న బీభత్స కాండను గురించి రాశారు. బహుశా ఇప్పుడు పశ్చిమ బెంగాల్‌లో మమతా బెనర్జీ హయాంలో అంతకంటే కూడా తీవ్రమైన హింసాకాండ సాగుతుందని మనకు వస్తున్న వార్తలు తెలుస్తున్నాయి.

అందుకనే కవులు క్రాంతదర్శులు. కొంత భవిష్యత్తును వారు చూస్తారు అని, ఇక గ్రీకు భాషలో అయితే కవి అనే మాటే లేదు, ఋషి భవిష్యత్తు తెలిసిన వాడూ, దార్శనికుడూ, కవి అన్న పదానికున్న అర్థాలేఅవి. అలాంటివి చూడగలిగితే. చూడలేకపోతే మహాకవి శ్రీశ్రీ ఎవరయ్యా అంటే తన జాతిని ఒకడుగు ముందుకు వేయించిన వాడు మహాకవి. మరి వెనక వేయించిన వాడు ఎవరయ్యా అంటే వాడూ కవే. మన విశ్వనాథ సత్యనారాయణ పదడుగులు వెనక్కి వేయించాలని చూస్తుంటాడు వీలైతే అన్నాడు.



కుటుంబ సభ్యులతో సివి

శ్రీశ్రీ గురించి పదేపదే ప్రస్తావన వస్తుంటుంది కదా! శ్రీశ్రీ మీద చాలాసార్లు దాడి జరిగింది. 1955లో తీవ్రమైన దాడి జరిగింది. ఆయనకు మతి స్థిమితం కూడా తప్పింది. ఆ సమయంలో కూడా సీవీ గారు కమ్యూనిస్టు పార్టీని సమర్థిస్తూ వరహాల రావు అనే పేరుతోనే రాశారు. 1955 దాడుల మీద విషపు దాడుల వికృత చరిత్ర 400 పేజీల పుస్తకం కోసం విశాలాంధ్రకు వెళ్ళి అవన్నీ కూడా ఫొటోలు తీసి బుక్ వేశాం. అవి రెండు మూడు ముద్రణలను కూడా పొందింది. మనందరం సీవీని 1970 తర్వాత చూసిన వాళ్ళం కాబట్టి 1955లో కూడా అప్పుడు జరిగిన దాడులన్నిటిని ఖండించాడు. శ్రీశ్రీ మీద జరిగిన దాడిని చాలా ఖచ్చితంగా అప్పుడు కూడా ఖండించారు ఆయన. తర్వాత శ్రీశ్రీకి రావాల్సినదానికంటే ఎక్కువ పేరొచ్చిందని, శ్రీశ్రీ కమ్యూనిస్టును బలపర్చబట్టే మహాకవి అని ఇలాంటి వాదనలు చేస్తున్న సమయంలో ఈయన ప్రజల పక్షాన వున్నాడు ఆయన ప్రజల పక్షాన వున్న కవిగా, మహాప్రస్థాన గీతాచార్యుడు అనే ఒక బిరుదునిచ్చి చివరి వరకు కూడా అటు పుచ్చలపల్లి సుందరయ్యను, ఇటు శ్రీశ్రీని జీవితంలో ఎప్పుడూ కూడా. అందుకే వాళ్ళిద్దరిపైనా కవితలు రాయడం కనిపిస్తుంది. అది అలా వుంచితే శ్రీశ్రీ విషయంలో సీవీ గారి అధ్యయనం గానివ్వండి, గౌరవం చివరివరకూ ఖచ్చితంగా వుండటం తెలుగు సాహిత్యంలో ఒక అరుదైన ఉదాహరణగా మనకు కనిపిస్తుంది.

.....

ఈస్థటిక్స్ బదులు పాలిటిక్స్ వుండాలి అనేటటువంటి దృక్పథం మటుకు మార్క్సిస్టులకు, రష్యన్లకు కానీ లేదు. నా దృష్టిలో. ఈ సందర్భంలో ముఖ్యంగా గమనించాల్సింది మనం ఏది ముందు? ఏది వెనుక? అమ్మ లాంటి అద్భుతమైన నవల సోవియట్ యూనియన్ కంటే ముందే వచ్చిందనే విషయం మనం గుర్తుపెట్టుకోవాలి.

ప్రపంచంలోనే రష్యాలోనే విప్లవం ఎందుకు వచ్చింది? దానికి కావలసిన సాంస్కృతిక నేపథ్యం అక్కడ బ్రహ్మాండంగా వేయబడింది. ఆ సాంస్కృతిక నేపథ్యంనుంచి టాల్‌స్టాయ్‌ని ఎలా అర్థం చేసుకోవాలో లెనిన్ రాశాడు. మార్క్సిస్ట్, ఈస్థటిక్స్ మీద చాలా చాలా పుస్తకాలు ముద్రణ, ప్రచురణలు జరిగాయి. వీటినుంచి మనం కొత్త కొత్త పాఠాలు, కొత్తకొత్త నేపథ్యాలు కూడా తీసుకోవాలి. ఇంకా మెరుగుకూడా పర్చుకోవచ్చు. కానీ నేననుకోవడం ఈస్థటిక్స్ అక్కర్లేదు, పాలిటిక్స్ మాత్రమే వుండాలి అనేటటువంటిది బహుశా లేదేమో, ఒక దశలో వురిదుండొచ్చు. 64, 54 మధ్య రష్యాలో జరిగే చర్చను దృష్టిలో పెట్టుకుని తర్వాత ఈస్థటిక్స్ మీద ప్రోగ్రెస్ పబ్లిషర్స్ నుండి చాలా పుస్తకాలు మార్క్సిస్ట్, ఈస్థటిక్స్ అని వచ్చాయి. సాహిత్య భౌతిక వాదం

అన్న త్రిపురనేని సిద్ధాంతం అది ప్రామాణికమా కాదా అన్నదానిమీద విరసంలోనూ పీపుల్స్ వార్‌లోనూ చాలా చాలా చర్చ జరిగింది. దానిలో యాంత్రికత చాలా వుంది అని ఒక భావన కూడా వచ్చింది. బహుశా సీవీ గారు దాన్ని ఆమోదించి వుంటారని నేననుకోను.

.....

ఏనుగుకూ మనిషికి ప్లాస్టిక్ సర్జరీ చేస్తే వినాయకుడయ్యాడో లేదో తెలియదు కానీ, కార్పొరేట్‌కు, కాషాయానికి ప్లాస్టిక్ సర్జరీ చేస్తే మోడీ అయ్యాడన్నది నిజం.

పుణ్యవతి గారి పుణ్యాన ఒక కీలకమైన అంశం మనం సామాజిక న్యాయాన్ని చర్చించేటప్పుడు మరుగుపడుతున్న మహిళల విషయం. నేను ఆ సగం సంగతులు అన్నట్టుగా అవి రావడం చాలా సమంజసంగా వుంది. అందులోనూ దుర్భర భారతంలో, నిర్భయ పర్వంలో ఇది మరింత ప్రాధాన్యత సంతరించుకుంటుంది. కానీ సీవీ రచనల గురించి చెప్పినపుడు ఒకటి చెప్పాలి. వేనరాజును, పృధువుతో చంపించినపుడు ప్రశ్నించేటటువంటి ఒకే ఒక గొంతు వేణుడి తల్లి. ఏంట్రా, నువ్వు మీనాన్నను ఎందుకు చంపావురా? అనే ఒక మాతృమూర్తితో ఆ ధిక్కార స్వరం వినిపించాడు. సత్యకామజాబాలిలో కూడా అంతర్లీనంగా ఉ ండేది జాబాలి తల్లి. ఆ తల్లి పడిన బాధ అదంతా ఉంటుంది. మన ప్రాచీన సాహిత్యంలో శ్రీశ్రీతో సహా మాతృత్వం దానికిచ్చిన ప్రాధాన్యత, జీవన భాగస్వామిగా సగభాగం, సమాజంలో సగభాగంగా వున్న స్త్రీకి ఆ చైతన్యం తగినంతగా రాలేదేమోనన్నది పూర్తిగా నిజం.

.....

**ముగింపు**

మొదటే చెప్పినట్టు ఇది ఒక గొప్ప సందర్భం. ఒక సంకేతం, ఒక గొప్ప సంఘర్షణ. 'కావాలి మనకూ ఒక సాంస్కృతిక విప్లవం' అని పుస్తకం రాసినటువంటి సీవీ స్ఫూర్తితో ఈ రచనలు మరొక్కసారి మనం తలచుకోవడం ద్వారా ఒక విశాల, వికాస వేదికగా అటువంటి సాంస్కృతిక రంగంలో సవాళ్ళను ఎదుర్కోవడానికి సమాయత్తం కావడానికి బాట వేసిందనే నేను భావిస్తున్నాను.

ౕ, ఒక అరుదైనటువంటి గౌరవాన్ని సీవీగారిపట్ల ప్రదర్శించడం ద్వారా వారి రచనల్లో యిచ్చిన సందేశాన్ని మా జీవితాలకు, మా వుద్యమాలకు, మా పోరాటాలకు అన్వయించుకుని ముందుకు తీసుకు పోతాము ఇప్పుడున్నటువంటి ప్రత్యేక పరిస్థితుల్లో ఒక ప్రత్యామ్నాయ సంస్కృతి నిర్మాణానికి, గతంలో వున్నటువంటి ప్రత్యామ్నాయ ప్రజాసాంస్కృతి వారసత్వాన్ని నిలబెట్టడానికి మరొకసారి ప్రతిన బూనుతామని చెప్పడం ఈ సమావేశం యొక్క ఉద్దేశం.

చేయెత్తి జైకొట్టు తెలుగోడా! గతమంతా ఘనకీర్తి కలవోడా! అని కమ్యూనిస్టులు పాట కడితే ఆ పాట చైతన్య రథం మీద వేసుకొని ఒకాయన తిరిగాడు. ఆ తరువాత ఆయన అల్లుడు వచ్చాడు. ఆయన హైదరాబాదు నేనే కట్టాను, విశాఖపట్నం తుఫానుకు పోతే నేనే కట్టాను. ఇప్పుడు విశాఖ, విజయవాడ, అమరావతి నేనే కట్టాను. అనే లెవల్లో ఆయనను్నాడు. ఇటువంటి కుహనా, కుటిల సంస్కృతి, కులాలు ఇవన్నీ కూడా విజృంభిస్తున్నటువంటి కాలంలో ఒక హేతుబద్ధమైన, ఆరోగ్యవంతమైన , సంస్కార వంతమైన టువంటి సామాజిక వాతావరణం కల్పించడానికి కూడా ఈ సమావేశం నాంది పలకాలని మనం కోరుకోవాలి.

ఇది ఒక చేతి మీద జరిగింది కాదు. పుస్తక ప్రచురణ వరకు ప్రజాశక్తి బుక్ హౌస్ చేసింది. ఈ సభా నిర్వహణలో ఉమామహేశ్వరరావు దగ్గర్నుంచి నా వరకు అనేక సంస్థలు, వ్యక్తులు, శక్తులు, వామపక్ష ప్రజాతంత్ర శక్తులు అందరూ కలిసి చేశారు. ఒక సాహిత్య సభకి హాలు కిక్కిరిసినటువంటి సందర్భమే మనకు ఉదాహరణ. 2005లో పదేళ్ళ కిందట విజయవాడలో సాహిత్య సభ జరిగింది. అది ఒక కొత్త ప్రయోగం అప్పుడు. అది నూతన వాతావరణం తీసుకొని వచ్చింది. ఈ సమావేశం సమ్మేళనం కూడా అటువంటి ప్రస్తావనకు, మళ్ళీ పునః ప్రస్థానానికి దారి తీయాలి. సీవీ ప్రాథమికంగా, మౌలికంగా రచయిత. రచయితగా, అధ్యయన పరుడుగా ఆయన చేసిన కృషి, ఆయనిచ్చినటువంటి సంపుటాలు సీవీ సమగ్ర రచనల సమాహారం సారాంశంగా ఇక్కడున్నటువంటి సాహితీవేత్తలు, రచయితలు, కవులు, యిక్కడికి రానివాళ్ళు, యింకా మిగలిన చోట్ల వున్న వాళ్ళు కూడా ఒక విలువైన సాహిత్యం, నిలబడేటటువంటి సాహిత్యం సృష్టి చేయడానికి సృజన రంగంలో విమర్శన రంగంలో, అధ్యయన రంగంలో కూడా అటువంటి ఒక పెద్ద బృహత్ ప్రయత్నానికి ఈ సమావేశం దారి చూపాలని కోరుకుంటున్నాను.

౧౨

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad ...

# వజ్రాయుధ కవికి అభినందన

సాహితీ దిగ్గజం వజ్రాయుధం కవి ఆవంత్స సోమసుందర్‌ను సిపిఐ(ఎం) పార్టీ రాష్ట్ర కార్యదర్శి పి. మధు జూలై 11న తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో కవి స్వగృహంలో ఆత్మీయంగా సత్కరించారు. ప్రజల పక్షాన, సామాన్యులకు అండగా నిలిచే ప్రజా కవులను అభినందించాలని ఈ కార్యక్రమం తలపెట్టినట్లు పి. మధు ఈ సందర్భంగా తెలిపారు. ఆవంత్స సోమసుందర్ తన స్పందనలో తను జీవితాంతం సామాన్యుని పక్షాన నిలబడతానని, వర్తమాన సామాజిక పరిస్థితులు గమనించినప్పుడు వామపక్ష ప్రగతిశీల ఉద్యమాలు బలపడవలసిన అవసరం బాగా కనపడుతుందని అన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, సాహిత్య ప్రస్థానం సంపాదకులు తెలకపల్లి రవి మాట్లాడుతూ నిజాం రాజుకు వ్యతిరేకంగా, తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి మద్ధతుగా 'వజ్రాయుధం' కవితా సంపుటి వెలువరించి ఆవంత్స సోమసుందర్ సామాన్యుల వెంట 'వజ్రం' లా నిలిచారని అన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వొరప్రసాద్, ప్రజాశక్తి బుక్‌హౌస్ జనరల్ మేనేజర్ లక్ష్మయ్య, తూర్పుగోదావరి జిల్లా సిపిఐ(ఎం) కార్యదర్శి శేషుబాబ్జి, నాయకులు ప్రకాష్, కాకినాడ సాహితీస్రవంతి కన్వీనర్, రచయిత గనారా, విశాఖపట్నం సాహితీస్రవంతి అధ్యక్ష కార్యదర్శులు ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు, నాగరాజు, సాహిత్యాభిమానులు, సిపిఐ(ఎం) పార్టీ కార్యకర్తలు పెద్దయెత్తున పాల్గొన్నారు.











